భారతీయ సాహిత్య నిర్మాతలు

# భా ర తి

రచన :

ఆంగ్ల మూలం :

ప్రేమా నందకుమార్

తెలుగుసేత :

ఆర్. ఎస్. సుదర్శనం



సా హి త్య   అ కా డె మీ

న్యూ ఢిల్లీ.

BHARATHI—Telugu translation by R. S. Sudarshanam of
Prema Nandakumar's English monograph—
Sahitya Akademi, New Delhi, 1981 Price Rs **4-00**



First Edition : 1982

Copies available from
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-110 001

Regional offices :
29, Eldams Road, Madras-600 018,
Block VB, Ravindra Stadium, Calcutta-700 029,
172, Mumbai Marathi Grantha Sangrahalaya Marg, Dadar,
Bombay-400 014

Published by Sahitya Akademi, New Delhi-110 001
and Printed at Weldun Press,
68, Mannappa Mudali St., Madras-600 021

# తొలి పలుకు



సుబ్రహ్మణ్య భారతి 'భారతీయ సాహిత్య నిర్మాతల'లో పరిగణింప దగినవాడు. ఆధునిక తమిళ సాహిత్యానికి వేగుచుక్కగానే కాక, భారతీయ జీవనమూ సాహిత్యమూ ఇరవయ్యో శతాబ్దిలో పొందిన వికాసానికి మార్గ దర్శకులైన ప్రముఖులలో ఆయన ఒకరు. అంతేకాదు. కవిగా ద్రష్టగా మానవ భవితవ్యాన్ని లక్షించిన ప్రవక్త కూడా.

భారతి కవిత్వమూ, వ్యక్తిత్వమూ నన్నాకర్షించి సరిగ్గా ఇరవై ఏళ్ళు అవుతున్నది దాని ఫలితమే, నేనుచేసిన కొన్ని మొదటి అనువాదాలు— "భారతి కవిత్వము: ఇంగ్లీషు తర్జుమాలు" (1958) అనే సంపుటి నా మొదటి పుస్తకంగా వెలువడింది. భారతి జీవితాన్ని గూర్చి, కవిత్వాన్ని గూర్చి, నేను (ఇంగ్లీషులో) వ్రాసిన రెండు గ్రంథాలు క్రమంగా 1964, 1968 సంవత్సరాలలో, ప్రొ॥ సి. డి. నరసింహయ్య సంపాదకత్వం క్రింద "భారతీయ రచయితలు: వారి రచనలు" అన్న గ్రంథమాలికలోనూ, ప్రొ॥ కె. స్వామినాథన్ సంపాదకుడుగా సిద్ధపరచిన "జాతీయ జీవితచరిత్రలు" అన్న మాలికలోనూ వెలువడినవి 1974లో "సుబ్రహ్మణ్య భారతి" అను శీర్షికతో ఒక గ్రంథం ట్వాయిన్ సంస్థవారి "ప్రపంచ రచయితలు" అన్న మాలికలో ప్రకటితమైంది. అందులో చాల భాగం, 1968 నాటి నా గ్రంథం నుంచీ చౌర్యంచేసిన బాపతు తప్ప వేరుకాదు! ఈ విషయాన్ని వారికి నేను తెలియజేయగా ట్వాయిన్ ప్రచురణ సంస్థ "విదేశాల్లో పుస్తకాలు" (1976) అనే ప్రచురణలో క్షమాపణ చెప్పుకొని, తర్వాత ఆ పుస్తకాన్ని పంపిణీ చెయ్యడం విరమించుకొన్నారు.

ఈ మధ్యకాలంలో నా అనువాదాల సంపుటి, సవరణలతో, చేర్పు లతో, విస్తృత పరిధిలో క్రొత్త రూపందాల్చి, "యునెస్కో", "సాహిత్య అకాడెమీ" సంస్థల సంయుక్త సాహాయ్యంతో "సుబ్రహ్మణ్య భారతి కవి తలు"గా ఇటీవల ప్రచురింపబడింది.

ప్రస్తుత సంగ్రహ రచన, "భారతీయ సాహిత్య నిర్మాతలు" గ్రంథ మాలిక పథకానికి అనుగుణంగా, తమిళ సాహిత్య చరిత్రను రంగభూమిగా

తీసుకొని, భారతి విశిష్ట స్థానాన్ని నిరూపించే విధంగా తయారైంది. భారతి 95 ఏళ్ళ క్రితం జన్మించారు. ఆ కాలం ఆధునిక భారతీయ చరిత్రలో దారి మలుపు. లోకమాన్య తిలక్, వి. ఓ. చిదంబరం పిళ్ళై, శ్రీ అరవిందులు, మహాత్మాగాంధీల "వందేమాతరం", "సహాయ నిరాకరణోద్యమా"ల కాలం. ఆ సమయంలో తమిళ కవిత్వాన్నీ, వచన రచననూ, తమిళుల భావ సంస్కారాన్నీ, శక్తి వంతమైన క్రొత్త అభివ్యక్తితో, సరిక్రొత్త లక్ష్యంతో, క్రొత్త ఆలోచనతో ఉత్తేజపూరితం చేయడం భారతికి విధి నిర్ణయించిన పాత్ర. భారతి తర్వాత తమిళ సాహిత్యం మారిపోయింది. క్రొత్త శక్తియుక్తులతో, క్రొత్త బాధ్యతలను నిర్వహిస్తూ క్రొత్త దిశల్లో ప్రస్థానం సాగించింది.

భారతి కవితల ఆంగ్లానువాదాలు, ఈ పుస్తకంలో చేర్చినవి, నేను చేసినవే. ఆసక్తిగల పాఠకులు నా గ్రంథం "సుబ్రహ్మణ్య భారతి కవితలు" చూస్తే, సమగ్రమైన భారతి కవితా స్వరూపం గోచరిస్తుంది. ఇక్కడ కొన్ని రచనల అనువాదాలు అనుబంధంగా ఇవ్వబడినవి.

ఈ రచన నా కప్పగించినందుకు సాహిత్య అకాడెమీ వారికి నా కృతజ్ఞతలు. భారతి గూర్చి లోగడ నేనువ్రాసిన గ్రంథాల్ని సమీక్షించిన వారికి, విమర్శకులకూ, నన్నీ కార్యభారం ప్రేమతో శ్రద్ధతో వహించేందుకు వాళ్లు ప్రోత్సాహపరచినందుకు, వందనాలు. ఈ చిన్ని ప్రయత్నంతో రాబోయే భారతి శతజయంతి ఉత్సవాలకు కొంత పూర్వరంగం సిద్ధపరచి నట్లౌతుందని నమ్ముతున్నాను.

నన్ను ప్రోత్సహించిన మా నాన్నగారు ప్రొ॥ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్, మా అమ్మ శ్రీమతి పద్మాసని, నా సోదరుడు ప్రొ॥ ఎస్. అంబిరాజన్ గార్లకు నా నమస్సులు.

'మదర్స్ సెంటర్'
డి-11, బి హెచ్.పి వి. టౌన్‌షిప్
విశాఖపట్టణం-530 012
ఫిబ్రవరి 1978

ప్రేమానందకుమార్

# విషయ సూచిక

## అధ్యాయం 1.

# తమిళ సాహిత్యం:
# సుబ్రహ్మణ్య భారతికి పూర్వరంగం

భారత దేశంలో రెండు గొప్ప సాహిత్యాలు చాలా ప్రాచీనమైనవి ఉత్తర భారతంలోని సంస్కృత సాహిత్యం, దక్షిణ భారతంలోని తమిళ సాహిత్యం. రెండింటికి రెండువేల సంవత్సరాలకు పైబడిన మహత్తరమైన చరిత్ర ఉన్నది. తమిళులకు గ్రంథస్థమైన చరిత్ర క్రి. శ. రెండవ శతాబ్ది ప్రాంతాలలో ప్రారంభ మౌతున్నది. అప్పటికి తమిళులు తమదైన సంస్కృతిని. అంటే సాహిత్యంలో ప్రతి ఫలించిన సంస్కృతిని, రూపొందించుకొని ఉండినారు. 'తమిళ సంప్రదాయం' అనేది వైశిష్ట్యంతో, 2381 పద్యాలలో 473 కవుల రచనల్లో, జాతియొక్క అభి వ్యక్తిగా నిలిచిన ఈ మొదటి సాహిత్య సంపద ద్వారానే మనుగడ ప్రారంభించింది ఈ కవులలో 102 మంది తమపేర్లు చెప్పుకోలేదు ఉషస్సులో వికసించే నవజాత సురభిళ పుష్పాలవలె, ఈ కవితలు 'ఎట్టు-త్తొగై' (అష్టగేయ బంధాలు), "పత్తు-ప్పాట్టు" (పది పాటలు) అనే సంపుటులుగా సేకరింపబడి, ఇప్పుడు "సంగం కవిత్వం" అనుపేర సమిష్టిగా పిలువబడుతున్నవి.

అటు తర్వాతిది ఇతిహాస యుగం. తమిళంలోని పంచమహా ఇతిహాసాలలో మూడు మాత్రమే సంపూర్ణంగా నేడు మనకు లభిస్తున్నవి వాటిలో చాల ప్రసిద్ధి పొందినది: రాజా ఇళంగో "శిలప్పాధికారం." తమిళుల భావ ప్రపంచంలో రామాయణంతో సాటివచ్చే గ్రంధమిది. శీత్తలైసాత్తనార్ "మణిమేఖలై" అనే ఇతిహాసం బౌద్ధమత ప్రబోధకం. లౌకికమైన దుఃఖాన్ని అధిగమించేందుకు వైరాగ్యమే మార్గమనే బౌద్ధుల ఆదర్శాన్ని ఈ గ్రంథం చెబుతున్నది. తిరుత్తక్క దేవర్ "జీవక చింతామణి" బహుశా మూడు ఇతిహాసాలలోనూ చివరి రచన కావచ్చు (క్రి. శ. తొమ్మిదవ శతాబ్ది ప్రాంతం) ఇది జైన గాధలమీద ఆధార పడిన గ్రంధం మూడింటిలోనూ ఈ చివరి గ్రంధమే, క్రియాశీలత్వంలోనూ, మతాభినివేశంలోనూ, సంపన్నమైనదని చెప్పవచ్చు దీని విలువ బీజప్రాయమూ, మౌలికమూ అని చెప్పాలి. కారణం, తర్వాతవచ్చిన ఇతిహాస రచనల్లోని పాత్ర

పోషణ, కవితా పదబంధ సంశ్లిష్టత, ఛందో పరిపూర్ణతవంటివి, ఈ ఇతిహాసపు వరవడిలోనే సాగినవి ఒక్క సుబ్రహ్మణ్య భారతి ఆగమనంవల్లనే ఆధోరణిమారి, ఇతిహాస కావ్య రచనలో ప్రామాణికమనిపించుకొన్న ప్రముఖ స్థానాన్ని పైగ్రంథం కోల్పోవడం సంభవించింది.

ఇతిహాసయుగం తర్వాత బహుధా ఉజ్జ్వలమైన, భక్తి ఉద్యమానికి చెందిన ఆళ్వారుల, నాయనారుల యుగం వచ్చింది. తమిళభాష, నాటి మధ్యయుగపు సామాన్యుని వ్యహార భాషతో చక్కని అన్వయం సాధించింది. భక్త కవులైన పెరియాళ్వార్, నమ్మాళ్వార్, అప్పర్, మాణిక్కవాచకర్ తమిళ భాషకు పునర్జన్మ ప్రసాదించారు. అటు తర్వాత కంబన్ వ్రాసిన విశ్వజనీన ఇతిహాస కావ్యం 'రామావతారం' ఒక ముందడుగు. రామకథ, తమిళులకు సంగం యుగం నుంచీకూడా ప్రీతిపాత్రమైనది ఆళ్వార్లు రాముని వీరగాథలను వందలాది పాటలలో కీర్తించేరు. కాని రాముని గూర్చిన వివిధ గాథలనూ, వాల్మీకి రచించిన మహాకావ్యమునూ, తమిళుల ధార్మిక ఆధ్యాత్మిక సంప్రదాయాన్నీ, మూడింటినీ ఏర్చి కూర్చి ఒక బృహత్కావ్య నిర్మాణంగా రూపొందించడం కంబన్ సాధించిన కార్యం. "రామావతారం" కావ్యం "మానవుడుగా భగవంతుని అవతరణ మానవుని ఆరోహణకోసమే" అన్న సత్యాన్ని నిరూపిస్తున్నది, శ్రీ టి పి మీనాక్షి సుందరంగారు అన్నట్లు.

కంబన్ తరువాత ప్రసిద్ధులైన కవులు చాలమంది వచ్చారు. కాని వారు కంబన్ స్థాయిని అందుకోలేదు చెదురు మదురుగా కొన్ని చక్కని గీత రచనలు తప్పితే, తమిళ కవిత్వంలో కృషి చాలవరకు సాంప్రదాయికమైన అలంకారాలూ, ఛందస్సులో చిత్రమైన పోకడలూ, వీటికే అంకితమైపోతూవచ్చింది. ఇతిహాస కావ్యాలు ఎన్నోవచ్చేయి, కాని అవి చాలవరకు పురాణాలుగాను, "జీవక చింతామణి", "రామావతారం" వరవడిలో తయారైనవిగాను ఉన్నాయి ఆ విధంగా కూడా తిరుత్తక్క దేవర్ కావ్య గాంభీర్యాన్నిగాని, కంబన్ సృష్టిలోని గాన మాధుర్యాన్నిగాని, అది పొందిన ప్రజాదరణనుగాని, తరువాత వచ్చినవేవీ సాధించలేకపోయినవి సృజన స్తంభించి, భావసాత్మక ప్రతిభ గొడ్డుపోయిన ఆ స్థితిలో, తమిళభాష మరొక మార్గంలో పయనించడం అనివార్యమే ఐంది. మార్పుకి అనుగుణంగా పరిస్థితులూ ఏర్పడ్డాయి. తమిళ ప్రజ తమ ఆశయాలను అభివ్యక్తం చేయగల క్రొత్త గొంతుకల కోసం ఎదురు చూచింది.

19-వ శతాబ్ది మధ్యకాలానికి ఈ మార్పు తాలూకు క్రొత్తదనం గోచర మౌతూవచ్చింది. యోగి రామలింగస్వామి కరుణ ప్రధానమైన పాటల రచనను ప్రారంభించారు గోపాలకృష్ణ భారతి "నందనార్ చరిత్ర" వ్రాసి సామాన్యుల వాడుక భాషను కవిత్వంగా మలిచారు. ప్రొ॥ సుందరంపిళ్ళై "మనోన్మణీయం" అనే పూర్తి నాటకాన్ని వ్రాసి, తమిళభాష సంప్రదాయ శృంఖలాల్ని వదల్చుకో గలదని నిరూపించారు. అయితే "మనోన్మణీయం" (1891) కేవలం మొదటి అడుగు, సందేహిస్తూ వేసిన అడుగు, అనే చెప్పాలి తమిళ భాషను నిసర్గ సుందరంగా తేటపరచి, ఆధునికంచేసే కృషి, అప్పటికి ఇంకా ఎన్నో అవరోధాలను ఎదుర్కోవలసి ఉండింది ఆ అవరోధాలకు ప్రధానంగా హ్రస్వదృష్టిగల పండితులే కారణం వి. కళ్యాణ సుందర మొదలియార్, ఆయనా పండితుడే ఐనప్పటికీ, తాను రచించిన ఛందోబద్ధ సాంప్రదాయిక కవిత్వంలో కొంతవరకు వ్యవహార భాషా రీతుల్ని, సహజమైన మాటల లయనూ ప్రవేశపెట్టగల్గారు. కవిత్వాన్ని ప్రజలకు సన్నిహితంచేశారు.

అదృష్టవశాత్తు, వేదనాయకంపిళ్ళై (కవి, నవలా రచయిత). బి. ఆర్. రాజం అయ్యర్ (నవలా రచయిత, తత్త్వవేత్త), ఏ. మాధవయ్య (నవల. కథా రచయిత), యు వి. స్వామినాథ అయ్యర్ (పండితుడు, సంపాదకుడు, విమర్శకుడు), వంటి రచయితలు సాహిత్యరంగంలో అవతరించి, తమిళభాషకు వ్యవహార పటిమ, సహజ సౌందర్యము, అవగాహనా సౌలభ్యము చేకూర్చారు. కాని వాళ్లు కూడా సుదీర్ఘమూ సంకీర్ణమూ ఐన వాక్య రచనా ధోరణినుంచీ పూర్తిగా బయట పడలేక పోయారు. తమిళ కవిత్వాన్నీ, వచనాన్నీ పూర్తిగా ఆధునికంచేసి ముద్ర వెయ్యడానికి, ఒక మహాకవి, భాషను అనుశాసించ గలిగినవాడు, అవసరమయ్యాడు తమిళ హృదయంలో నిక్షిప్తమైయున్న ఈ ఆశయానికి అనుగుణంగా ఉద్భవించి నట్లు సుబ్రహ్మణ్య భారతి అవతరించాడు తమిళ కవిత్వమూ, ఆయన సాహిత్య కృషి రెండు దశాబ్దాలను మించలేదు కాని ఆ కాలంలోనే తమిళ కవిత్వమూ తమిళ సాహిత్యమూ చాలా పెద్ద అంగముందుకు వేశాయి. అలా అని భాష రెండువేల సంవత్సరాల తన మహత్తర సంప్రదాయాన్ని విడనాడలేదు. సజీవమైన ఆ సాహిత్య వారసత్వంనుంచే ఒక కొత్త స్వరూపం, ఫినిక్స్ పక్షిలాగ, పాశ్చాత్య ప్రభావ వీచికలతో సత్త్వపూర్ణమైన భాషగా పునః సృష్టి అయిందని చెప్పాలి. ఫలితం నూత్న తమిళ కవిత్వం. ఈ కవిత్వం దేశ భక్తిని గొంతెత్తి పలికింది; తమిళదేశ

సౌందర్యాన్ని చిత్రించింది; తమిళ చిత్తవృత్తిని ప్రేమలో వలపులో అను శీలించింది; తమిళ మనోలోకంలోని ఆధ్యాత్మిక అనుభూతుల్ని నమోదు చేసింది. ఆ భారతి యుగం అవిచ్ఛిన్నంగా ప్రకృతంలోకి వెల్లువలా ప్రవహిస్తున్నదంటే, అది భారతి గొప్పదనానికి ఒక తార్కాణం.

## అధ్యాయం 2.

# సుబ్రహ్మణ్య భారతి జీవితం

సుబ్రహ్మణ్య భారతి 1882 డిసెంబరు 11-వ తేదీ తిరునల్వేలి జిల్లా, ఎట్టాయపురంలో జన్మించాడు. ఈ చిన్న జమీందారీ తమిళనాడులో ఉంది దానిని ఆ రోజుల్లో నిరంకుశుడైన ఒక "మహారాజు" పాలించేవాడు. సుబ్రహ్మణ్యం తండ్రి చిన్నస్వామి అయ్యర్, జమీందారీ కొలువులో ఉద్యోగి. ఆయనకు ఆ వెనుకబడిన ప్రాంతంలో శాస్త్రీయ సాంకేతిక ప్రగతిని ప్రవేశింపజేయాలి అనే ఆశయం ఉండేది. సుబ్రహ్మణ్యం, తండ్రికి ప్రథమ సంతానం. పసిబిడ్డగా వున్నప్పుడే తల్లిని కోల్పోయాడు. అయ్యరుగారి ఆశలన్నీ ఈ అబ్బాయిపైనే ఉండేవి. కొడుకు ఇంగ్లీషు చదివి ఆఫీసరు లేక ఇంజనీరు కావాలని ఆయన కోరిక కాని సుబ్రహ్మణ్యానికి చదువుమీద పెద్ద ఆసక్తి ఉండేది కాదు. ఎట్టాయ పురం పరిసరాల్లో తిరుగుతూ చాలా సమయం మాతామహుని దగ్గర గడిపేవాడు. అక్కడే సంప్రదాయ తమిళ కవిత్వంలో తలమున్కలయ్యేవాడు. పదో ఏడు రాక పూర్వమే సుబ్రహ్మణ్యం తమిళంలో కవిత్వం చెప్పడం ప్రారంభించాడు అతని చిన్ననాటి సహాధ్యాయి అయిన ఎస్. సోమసుందర భారతి ఇలా చెప్పి వున్నారు.

"అబ్బురం కలిగించే భారతి కవితాశక్తిని పొగడుతూ అతని తండ్రితో పలువురు ప్రసంగించడం నాకు బాగా తెలుసు ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే, ఇతరులేదైనా సూచించగానే, దానిమీద చక్కని పద్యాలు కట్టేవాడు, ప్రసిద్ధులైన పద్యరచయితలు కూడా ఆ వింతకు ఆశ్చర్యపడేవారు."

కాని అయ్యరుగారి కిది సంతోషం కలిగించలేదు. ఆయన కుమారుణ్ణి చేరువలోనున్న తిరునల్వేలి పట్టణానికి పంపించి హైస్కూలులో చేర్చారు. అక్కడ విద్యార్థులలో సుబ్రహ్మణ్యం తన సమయస్ఫూర్తి గల మాటల చమత్కారంతో, ఆశుకవిత్వ పాటవంతో ఒక సంచలనం కలిగించినప్పటికీ, మెట్రిక్యులేషన్ పరీక్షకు ఎన్నిక కాకుండానే నిలిచిపోయాడు. తర్వాత ఎట్టాయపురం తిరిగి రావడంతో జమీందారీ కొలువులో మళ్లీ జమీందారు సన్నిధానవర్తిగా నియమింపబడ్డాడు. అతనికి 15-వ ఏట వివాహం జరిగింది. భార్య చెల్లమ్మాళ్ తర్వాత కొన్ని సంవత్సరాలు ఎట్టాయపురం శిష్టజనంలో సుబ్రహ్మణ్యం ప్రసిద్ధ వ్యక్తిగా మెలిగాడు. వయస్సుకు మించిన పాండిత్యం అతనికా స్థానాన్ని ఇచ్చింది. అతనికి "భారతి" అనే బిరుదుకూడా అప్పుడే ఇవ్వబడింది. ఒకనాడు రాజసభలో, తన కవితా శక్తిని నిరూపించుకొన్న సందర్భంలో, ఈ బిరుద ప్రదానం జరిగింది అతని జీవితంలో మరువరాని క్షణం అది. అంతవరకు "ఎట్టాయపురం సుబ్బయ్య" అని పిలువబడుతున్న అబ్బాయి ఆ నాటినుండీ "భారతి" అనేపేరుతో వ్యవహరింపబడ్డాడు. లక్షలాది తమిళ భాషా ప్రియులకు ప్రపంచ వ్యాప్తంగా నేడు "భారతి"గానే ప్రసిద్ధుడాయన.

జీవితం సుఖంగా ఇలా చాలనాళ్ళు సాగలేదు ఏడాదిలో చిన్నస్వామి అయ్యర్ మరణించాడు. కుటుంబం ఇబ్బందులపాలైం ది. ఆయన రెండవ భార్య పిల్లలతో తన పుట్టింటికి వెళ్ళిపోయింది. భారతి బెనారస్ వెళ్ళాడు రెండేళ్లు మేనత్త కుప్పమ్మాళ్, ఆమె భర్త కృష్ణశివన్ దంపతులదగ్గర గడిపాడు. వారు దైవభక్తి గలవారు. అక్కడ సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు భాషల్లో ప్రావీణ్యం సంపాయించి, అలహాబాదు విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్షకు కూర్చొని, ఉత్తమ శ్రేణిలో కృతార్థుడయ్యాడు.

బెనారస్‌లో గడిపిన కాలం భారతి వ్యక్తిత్వంలో మహత్తరమైన మార్పు తెచ్చింది. బాహ్యవేషంలో శిక్కుల శిరస్త్రాణం, మీసకట్టూ, నడకలో ఠీమా కలిగిన ఊపూ, కొత్తగా ఏర్పడ్డాయి. ఆనీబెసెంట్ ఉపన్యాసాలు వినడం ద్వారా విశాల దృక్పథాన్ని ఏర్పరచుకొన్నాడు. ఆంతరంగికంగా కూడా కసుగాయవంటి ఈ యువకునిలో గొప్ప మార్పు వచ్చింది అంతవరకు సంప్రదాయబద్ధమైన కవిత్వ వాగురలో ఇమిడిఉన్న అతని ప్రతిభ, విప్లవ భావాలతో, షెల్లీవంటి ఇంగ్లీషు రొమాంటిక్ కవి రచనలు అధ్యయనం చెయ్యడం వల్లనే కావచ్చు.

ఆధునిక కవితా శ క్తిగా రూపు దిద్దుకొన్నది. కాని దారిద్ర్యం అతనిని వదల లేదు కొన్నాళ్ళు ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు. చాలీ చాలని జీతంతో అది భవిష్యత్తుకు దారిచూపలేదు. 1901 లో ఎట్టాయపురం తిరిగివచ్చి జమీందారీ కొలువులో ప్రవేశించాడు.

ఆ మారుమూల ప్రదేశంలో జీవితం సాఫీగానే నడిచింది రెండేళ్ళు జమీందారు సహచరునిగా ఉద్యోగం నిర్వహిస్తూ గడిపాడు తీరిక సమయంలో షెల్లీ, కంబన్, ఇళంగో కవుల రచనల్ని లోతుగా అధ్యయనం చేశాడు. తర్వాత ఒకనాడు "మహారాజా" వారికి, వ్యంగ్య భరితమైన ఒక కవితద్వారా వీడ్కోలు చెప్పి, మధురై పట్టణం చేరుకున్నాడు. అక్కడ మూడు నెలలపాటు సేతుపతి హైస్కూలులో తమిళ పండితుడుగా స్వల్పకాలిక ఉద్యోగం చేశాడు. తలవని తలంపుగా ఒకనాడు జి. సుబ్రహ్మణ్య అయ్యర్ అనే సంపాదకునికి పరిచయం చెయ్యబడ్డాడు. ఆయన ప్రసిద్ధ తమిళ దినపత్రిక "స్వదేశమిత్రన్" సంపాదకుడు. భారతి 1904 నవంబరు మాసంలో ఉపసంపాదకుడుగా ఆ పత్రికలో చేరాడు

ఈ కొత్త ఉద్యోగంవల్ల డబ్బురాబడి పెరగలేదు సరిగదా, అది సులభ మైన, సుఖప్రదమైన ఉద్యోగం కూడా కాదు కాని అది భారతి మనస్సుకు నచ్చిన పనే. స్వామీ వివేకానంద, అరవిందఘోష్, బాలగంగాధర తిలక్ వంటి నాయక శ్రేష్ఠుల మాటల్నీ ఉపన్యాసాలనూ తమిళంలోకి అనువదిస్తూ భారతి చాలకాలమే గడిపాడు. 19-వ శతాబ్దంనాటి తమిళ నిబద్ధవచన శైలి, భారతి చేతిలో అనిబద్ధమై, సహజ సుందరమూ, శక్తిమంతమూ ఐన సాధనంగా రూపొంది, స్పష్టమైన అభివ్యక్తికి, అన్వయసౌలభ్యంతో ధారాళమైన వస్తు విన్యా సానికి విషయ చర్చకూ ఉపయుక్తమౌతూ వచ్చింది అనువాదం వంటి బండ పనికూడా ఒక అమూల్యమైన శిక్షణగా, సాహిత్యపరమైన కృషిగా అలా పనికి వచ్చిందనే చెప్పాలి. తద్వారా భారతి సొంత రచనల్లో కూడా భాష నైర్మల్యాన్నీ తేటదనాన్నీ, శక్తినీ సంతరించుకొన్నది. అటుపైన భారతి సాధించిన ప్రగతి తమిళ కవిత్వానికి మహత్తరమైన వరం—అదే భారతి యొక్క విశిష్టమైన గీత రచనా పద్ధతి; ఉరవడినీ, సొగసునూ కలిగి, గాంభీర్యాన్నీ సౌలభ్యాన్నీ మేళవించి తమిళ సాహిత్య రంగాన్ని ప్రజ్వలితం చేసింది.

మొదట్లో భారతి రచనల్లోని వినూత్నమైన శక్తి జాతీయ రాజకీయాల్లో ఆయన నిమగ్నుడు కావడంవల్లనే వచ్చింది. పత్రిక ఉపసంపాదకుడుగా

రాజకీయ రంగానికి ఆయన సన్నిహితంగా ఉండేవాడు. అనతి కాలంలోనే జాతీయవాదుల్ని, అంటే కాంగ్రెసు పక్షములోని అతివాదుల్ని, ఆయన సమర్థిం చడం ప్రారంభించాడు. అనాలోచితమైన బెంగాల్ విభజన (1905) జాతి మొత్తాన్నీ రెచ్చగొట్టి కోపోద్రిక్తం చేసింది. ఆ యేడు డిసెంబరులో బెనారసులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సమావేశానికి భారతి హాజరయ్యాడు అక్కడినుంచీ తిరిగివస్తూ, కలకత్తా వెళ్ళి సోదరి నివేదితను కలుసుకొన్నాడు స్వామి వివేకా నందుని ఆధ్యాత్మిక పుత్రిక ఐన ఆమె భారతిలో ఒక మహత్తర పరిణామానికి కారణమైంది. భారతి వెంటనే మూడు లక్ష్యాలను సాధించడంకోసం కంకణబద్ధు డయ్యాడు — దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం, వర్ణవిభేద నిర్మూలనం, స్త్రీలకు దాస్య విముక్తి ఆయన జీవితాంతం వరకు భారతి, సోదరి నివేదితను తన ఆధ్యాత్మిక గురువుగా కృతజ్ఞతా భావంతో స్మరించేవాడు ఆమెను మానవరూపం ధరించిన 'మహాశక్తి'గా భావించేవాడు. దేశభక్తి పూరితమైన తన మొదటి కవితా సంపుటులను రెండింటిని—"స్వదేశ గీతంగళ్" (1908) 'జన్మభూమి" (1909) - ఆమెకే అంకితమిచ్చాడు ఆ అంకితంలో - "మాటలతో పనిలేకుండా క్షణకాలంలో మాతృసేవా తత్వాన్ని గూర్చి, త్యాగాన్ని గూర్చి నాకు బోధించిన సోదరి నివేదితకు" అని పేర్కొన్నాడు

అటుపై స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని అందులోని కష్ట సుఖాలను ఇతరులతో పంచుకోవాలనే సంకల్పం, పట్టుదల, భారతిలో మరింత దృఢపడింది. కాని ఆవేశంతో ఆయన వ్రాసే రచనలన్నీ "స్వదేశమిత్రన్" వంటి మితవాద పత్రికలో ప్రచురించడానికి అవకాశం లేకపోయింది. దానికి భారతి మనస్సు నొచ్చుకోవడమే కాదు, తను బందీ ఐనట్లు భావించాడు అగ్ని జడులవలె ప్రజ్వ లించే అతని వాక్కులకు స్వేచ్ఛాభివ్యక్తి చేకూర్చేందుకు, "ఇండియా" అనేపేర ఒక క్రొత్త తమిళ వారపత్రిక 1906 లో మందాయం సోదరులచేత నెలకొల్ప బడింది. వారు తిరుమలాచారి, శ్రీనివాసాచారి అనే సోదర ద్వయం. దేశభక్తి ప్రపూరితులైన ఆ సోదరులు, వారసత్వంగా తమకు వచ్చిన పెద్ద ఆస్తిని స్వాతం త్ర్యోద్యమం కోసం వెచ్చించడానికి సిద్ధపడ్డారు తర్వాత సూరత్‌లో కాంగ్రెస్ చీలిపోయి మితవాదులు, అతివాదులుగా విడిపోయింది భారతి ఆవేశపూరిత స్వభావం ఆయన్ని అతివాదుల పక్షానికే మళ్ళించడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఆ పక్షానికి నాయకులు లాలా లజపతిరాయ్, అరవిందఘోష్, బాలగంగాధరతిలక్

గారలు. భారతి కవిత్వానికి కొత్త రెక్కలు వచ్చాయి. స్వాతంత్ర్య సంగీతాన్ని ఆలపిస్తూనే దానికి అనుశ్రుతిగా స్వచ్ఛంద సౌభాగ్య భావి భారతదేశాన్ని దర్శించింది ఆయన కవిత్వం. అంతేకాకుండా, వెన్నెముక లేని రాజకీయ మిత వాదులపట్ల నిశితమైన బాణాల్ని వర్షించింది, స్వార్థపరులై స్వాతంత్ర్య సమరంలో పాల్గొనని భారతీయుల్ని విమర్శించింది. ఆ కవితల్ని ప్రజ్వలింపజేసిన నిప్పువంటి ఆయన దేశభక్తి, రాజకీయ ప్రత్యర్థుల్ని కూడా సమ్మోహితుల్ని చేసింది నిజానికి మితవాద రాజకీయ నాయకుల్లో ప్రముఖుడైన శ్రీ వి కృష్ణస్వామి అయ్యరే, (మద్రాసు వాస్తవ్యుడు) భారతికి ఆర్థిక సాహాయ్యం చేసి అతని మొదటి పుస్తకం "స్వదేశ గీతంగళ్" (స్వదేశ గీతాలు) యొక్క ప్రచురణా, పంపిణీ బాధ్యతని వహించాడు

దేశంలో బ్రిటిషు ప్రభుత్వం, అలజడికి కారకులైన ఈ అతివాద రాజకీయ ప్రముఖులపై తీవ్ర చర్య తీసుకోవడం అనివార్యమే అయ్యింది అరవిందఘోష్, వి ఒ. చిదంబరంపిళ్ళై వంటి ప్రథమశ్రేణి అతివాద నాయకులందరూ జైళ్లలో బంధింపబడ్డారు. తిలక్ బర్మాలోని మాండలే జైలుకి ఏకాంత కారాగార శిక్ష అనుభ వించడానికి పంపబడ్డాడు. భారతికూడా అరెస్టు అయ్యే పరిస్థితి సమీపించింది. "వందేమాతరం" (కలకత్తా), "ఇండియా" (మద్రాసు) వంటి అతివాద పత్రికల మీద ప్రభుత్వ వ్యూహం బిగిసింది. భారతి అరెస్టు కోసం వారెంటుకూడా జారీ అయ్యింది అదృష్టవశాత్తూ స్నేహితుల హెచ్చరికల్నీ, సలహాల్నీ చెవినబెట్టి, భారతి పాండిచ్చెరీ (అప్పుడు ఫ్రెంచివారి ఆధీనంలో ఉండినది) వెళ్ళడానికి సమ్మతించాడు. అక్కడనుంచీ బ్రిటిషు ప్రభుత్వం మీదా, దాని నిరంకుశత్వం మీదా పోరాటం సాగించడానికి సిద్ధమయ్యాడు. భారతి విషయంలో ఇది అజ్ఞాతంలో అడుగు వెయ్యటమే. కాని శ్రీనివాసాచారి స్నేహితుడు కుప్పుస్వామి అయ్యంగార్ భారతిని కొన్ని రోజులు తనదగ్గర ఉంచుకున్నాడు. స్నేహాన్ని పెంచుకోవడంలో నేర్పుగల భారతి ఈ పరిస్థితికి ఎలాగో సర్దుకున్నాడు. మండాయం సోదరులుకూడా పాండిచ్చేరీకి మకాము మార్చి, "ఇండియా" పత్రికను అక్కడినుంచే ప్రచురించడం ప్రారంభించారు. ఇతర పత్రికలు "విజయ", "కర్మయోగి", "బాలభారత" కూడా ప్రారంభింపబడినవి. కాని అవి చాలకాలం కొనసాగలేదు. అక్కడ స్నేహితులతో, పత్రికా రచనతో, భారతి సరదాగానూ ఉత్సాహంగానూ గడిపాడు. కుటుంబంకూడా అతణ్ణి చేరుకున్నది,

బ్రిటిషు ప్రభుత్వం అతనిమీద నిరంతరమూ 'నిఘా' ఉంచడమూ, ఫ్రెంచి పోలీసులు అప్పుడప్పుడూ అతణ్ణి అజ కనుక్కోవడమూ తప్పితే జీవితం మరీ అధ్వాన్నంగా లేదు—నిజానికి భవిష్యత్తు ఆశాపూర్ణంగానే తోచింది.

"ఇండియా", తదితర పత్రికలూ పొందిన విస్తృత ప్రచారం, ప్రజాదరణా, బ్రిటిషు ప్రభుత్వానికి కోపం తెప్పించాయి ప్రభుత్వం "ఇండియా" పత్రికకు భారత దేశంలో ప్రవేశం లేకుండా ఆంక్ష జారీచేసింది. అందువల్ల ఆ పత్రిక 1910 మార్చి 12వ తేదీ సంచికతో పాఠకులకు వీడ్కోలు చెప్పింది. అనతికాలంలోనే మిగతా పత్రికలు కూడా వెలువడటం మానివేశాయి ఆ విధంగా 1910 సంవత్సరాంతానికి, భారతి నిరుద్యోగి అయ్యాడు అతని రచనలు తొందరలో ప్రచురింపబడే అవకాశం కూడా లేకుండా పోయింది

భారతి జీవితంలో బాధాకరమైన కాలం సంప్రాప్తమైంది. ఆర్థికమైన బాధలు గృహ జీవితాన్ని దుర్భరంచేశాయి కుటుంబానికి రెండు పూటలా అన్నం పెట్టే ఆధారంకూడా లేని పరిస్థితి ఎదురైంది. అతను వ్రాసినది ప్రచురించే అవకాశమే లేదు. నిరంతర కృషిచేసే రచయితకు, పాత్రికేయునికి, ఇంతకంటే విషాద పరిస్థితి ఏమి ఉంటుంది! పాండిచ్చేరిలో ఏర్పడిన మిత్రులు ఆయనకి ఊరట కల్గించారు శ్రీ అరవిందులు 1910 ఏప్రిల్ మాసంలో అక్కడికి విచ్చేశారు ఆయన రాజకీయాల్ని వదలిపెట్టి, దీర్ఘమూ కఠినమూ అయిన యోగానుష్ఠానాన్ని ప్రారంభిస్తూ, పాండిచ్చేరిని తన తపస్సుకి అనువైన 'గుహ'గా ఎంచుకున్నారు. సుబ్రహ్మణ్య శివ, వి వి. యస్. అయ్యర్‌వంటి ఇతర రాజకీయ నాయకులుకూడా పాండిచ్చేరిని ఆశ్రయం చేసుకున్నారు. బ్రిటిషు పోలీసుల బారినుండి దూరంగా ఉండటానికి వారు అలాచేశారు. ఈ విప్లవకారులందరూ చక్కని మేధావులుకూడా. వీరి సాహచర్యం భారతికి మానసికంగా, ఆధ్యాత్మికంగా ప్రేరణ నిచ్చింది. చర్చలు, సంవాదాలు ఎన్నో జరిగాయి. వేదాల్ని, "గీత" నీ అధ్యయనంచేశారు. సాహిత్య పరమైన సంగతుల్నీ ప్రశ్నల్నీ చర్చించి, ఇచ్చిపుచ్చుకోవడం జరిగింది అన్నింటినీ మించి నవభారత నిర్మాణ దీక్ష వారిని ఏకంచేసింది. ఎవరి పద్ధతిలో వారు దేశ విముక్తికి పరిశ్రమించారు.

సుబ్రహ్మణ్య భారతి కవితా వ్యాసంగం నూత్న పరిమాణాల్ని అధిరోహించడం ప్రారంభించింది. ఆయన శరీరము, మనస్సూ, ఎన్నో అవరోధాలతో బందీ అయి ఉండిన తరుణంలోనే ఆయన కవిత అత్యంత స్వేచ్ఛతో సుదూర విహారం

చెయ్యడం నేర్చుకొన్నది. ఆయన కవితా నవోన్మేషిత్వము క్రమంగా వేదాంత పరమైన మానవతా వాదంగా పరిణతి చెందింది తన కవితల్ని వెంటనే ప్రచురించే అవకాశం లేకపోయినా, దాన్ని గురించి ఆయన పట్టించుకోలేదు. ఆశిస్తున్న భావి స్వాతంత్ర్య లోకానికి వైతాళికులైన విశిష్ట వ్యక్తులు కొందరక్కడ, ఆ సమయంలో కలిసి ఉన్నారు. శ్రీనివాసాచారి, వి. వి. యస్. అయ్యర్, వీళ్ళేకాదు; శ్రీ అరవిందులు కూడా ఉన్నారు. భారతి, రచనలో సాహస ప్రయోగాలుచేస్తూ భావ తీవ్రతతో, దీక్షతో తన వ్యాసంగాన్ని సాగించాడు కొన్ని మామూలు సంఘటనలు కూడా అద్భుతమనే భావనతో, దైవ కృపనూ, దైవ సంకల్పాన్నీ సూచిస్తున్నా యన్న విశ్వాసంతో, ఆయన కలం వర్తించింది. ఉదాహరణకు, ఒకసారి ఆయన ఇల్లు మారినప్పుడు, ఆంతకు పూర్వం ఉన్న ఇల్లు మరుసటి రోజే వర్షానికి కూలి పోవడం, అటువంటి అద్భుత సంఘటనగా చిత్రింపబడింది:

"నిన్న అక్కడున్నాము—అక్కడే ఉంటే,
మా గతేం కాను?
మృత్యువు ఝుంఝుగా వచ్చింది కాని—
దైవమే కదా కాచి రక్షించింది!"

ఈ దైవ విశ్వాసమే ఆయన్ని పాండిచ్చేరిలో ఆ సుదీర్ఘమైన కష్టకాలంలో కాచి రక్షించింది. చుట్టూ అలముకొన్న చీకట్లలో అంతరంగపు లోతులనుంచీ ఆత్మ విశ్వాసపు వెలుగుని అన్వేషిస్తున్న రీతిగా, మళ్ళీ మళ్ళీ పై విశ్వాసాన్ని తన కవితలో ఆయన నిక్షిప్తంచేశాడు:

"దీనార్తులు దరిగానక
దుఃఖంలో మునిగేరు.
నిన్ను సేవించే నాకు
నీ కృపయే రక్ష.
తేట తమిళ గీతిలో
'శక్తి' మహత్తు
శ్రద్ధతో కొనియాడితే—
ఎదలో దిగులుండునా!"

భారతి శ్రద్ధాళువైన హిందువు; హిందూ దేవతలందరిమీద ఆయనకు గౌరవభావమే. కాని ఆయన వేదాంత భావన, 'శక్తి తత్త్వం'లోనే కేంద్రీకృతమైంది. అందులోనే ఆయన జాతీయ భావనా, దాని తాలూకు ఉద్వేగావేశాలూ అంతర్భూతమైనవి. అనతికాలంలోనే కవిత్వం ఆయనకు ఒక యోగ సాధనగా మారింది మాయను తొలగించి ఆత్మను ప్రకాశవంతం చెయ్యడానికీ, తన లక్ష్యసాధనకు మార్గాన్ని దర్శించడానికీ, అదే వెలుగుగా తోడ్పడింది:

"ఓ మాయా! నన్ను దోచుకోవాలని చూశావు,
నిన్ను అంతంచేసి తీరుతాను, ఓ మాయా!
మునిగి చావదల్చుకుంటే
మున్నీరెంతో దూరంలేదు;
శరీరం నిత్యం కాదని తెలిస్తే
నీవేం చెయ్యగలవు, ఓ మాయా?"

తరచు నిస్పృహతో, ఆకలి బాధతో భారతి పాండిచ్చేరి సముద్ర తీరాన సుదీర్ఘ సమయాలు గడిపేవాడు అదృష్టవశాత్తు ఎప్పుడుగాని ఆత్మహత్యకు పాల్పడలేదు. దాని బదులు, శరీరమనిత్యమని ఎరిగి ఉండడంవల్ల, ధైర్యం చిక్కబట్టుకొని, శక్తిని పునఃసంధించుకొని, గొప్ప కవిత్వాన్ని — నాటక, గీత రచనా పరంపరలనూ, "కణ్ణన్ పాట్టు", "పాంచాలీ శపథం", "కుయిల్‌పాట్టు"వంటి కావ్యాలనూ సృష్టించాడు. తర్వాత ఒకనాడు దేశబహిష్కృతిని ఇక సహించలేక బ్రిటిషు అధికారంలో నున్న భారతదేశానికి తిరిగి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఫలితాలు ఏమైనా సరే!

ఫ్రెంచి - బ్రిటిషు సరిహద్దుల్లో 1918 నవంబరు 20 వ తేదీ భారతిని అరెస్టు చేసి, కడలూరు సబ్‌జైలుకి 24 రోజుల పోలీసు నిర్బంధానికి పంపారు. అనీబెసెంట్, సి. పి. రామస్వామి అయ్యర్‌వంటి ప్రముఖ వ్యక్తులు జోక్యం చేసికోవడంవల్ల ఆయన్ని 24 వ తేదీ విడుదలచేశారు. తిరునల్వేలిలో ఆయనకు ఆదరంతోకూడిన స్వాగతం లభించింది. తర్వాత రెండు సంవత్సరాలు తనభార్య చెల్లమ్మాళ్ సొంత గ్రామమైన కడయంలో ఆయన గడిపాడు.

ఆర్థిక పరిస్థితి అదుర్దా కలిగిస్తున్నప్పటికీ, అంతకంటే తన రచనల వ్రాత ప్రతులు ప్రచురణకు నోచుకోకుండా కట్టలుగా పడిఉండడమే ఆయన హృదయాన్ని

వేధించింది. స్నేహితుల్ని అర్థించడమే కాదు, ప్రచురణ సంస్థ ఒకదానిని నెల కొల్పేందుకు ప్రకటనలుకూడా జారీచేశాడు. కాని ఏ ప్రయత్నమూ ఫలించలేదు. ఆయన స్ఫురద్రూపమూ, చైతన్యపూరితమైన వ్యక్తిత్వమూ ప్రజాసమూహాల్ని ఆకర్షించడం మానలేదు. చుట్టుప్రక్క గ్రామాల్లో ఆహ్వానం మీద వెళ్ళి చక్కని ఉపన్యాసాలు ఇచ్చేవాడు. 'అల్లా' 'మృత్యువు' వంటి వైవిధ్యంగల ఎన్నో విషయాలమీద మాట్లాడేవాడు. ఒకసారి మద్రాసులో మహాత్మాగాంధీని కూడా కలుసుకొన్నాడు అప్పటికి విప్లవకారుల అతివాద ధోరణి కొంత తగ్గుముఖం పట్టి ఉండటంవల్ల, భారతి మహాత్మాగాంధీ బోధనలవైపు మొగ్గు చూపాడు. ముఖ్యంగా అహింస, సహాయ నిరాకరణను రాజకీయపు ఎత్తుగడగా ఉపయోగించడం, ఆయన్ని ఆకర్షించినవి.

మానసిక పరిణామానికి తగ్గట్లు, ఆ సమయంలోనే ఆయన పూర్వం పని చేసిన పత్రిక "స్వదేశమిత్రన్" ఆయన్ని మళ్లీ ఆహ్వానించింది. భారతి సంతోషించాడు. అనిశ్చిత పరిస్థితులకూ, సందిగ్ధాలకూ స్వస్తి చెప్పాడు. బలవంతపు నిర్వ్యాపారత్వంవల్ల కలిగిన చిత్తక్షోభకు వీడ్కోలు చెప్పాడు.

భారతి అప్పటికి నిండైన పరిణతి నందుకొన్నాడు. ఆయన వ్రాసే మామూలు వాక్యంకూడా ధ్వని తరంగాలను సృష్టిస్తూ వ్యంగ్యభరితంగా తయారయ్యేది ఆయన పత్రికా రచన, చిటపటలతో భగ్గున వెలిగి ఆరిపోయే బాణసంచా కాదు. అది స్వీయానుభవంనుంచీ జ్ఞానసత్త్వంనుంచీ త్రవ్వి తీయబడినది ప్రపంచ సంఘటనలని గూర్చిన ఎన్నో విషయాలమీద (టర్కీలో పరిస్థితులూ, ఐరిష్ సమస్యా వంటివి) ఆయన చేసిన వ్యాఖ్యలు, తన పాఠక లోకాన్ని దృష్టిలో పెట్టుకొని బహువిధాల ఉదాహరణ పూర్వకంగా చేసిన ప్రబోధాలే. ఐర్లెండు సమస్యమీద లాయడ్ జార్జి వైఖరి ఉదారవిరహితంగా, సీతను చెర బట్టిన రావణుని వైఖరివలె ఉన్నదని, కంబన్ 'రామావతారం' కావ్యాన్ని ఉదాహరిస్తూ, తమిళ పాఠకులకు వెంటనే బోధపడేలా ఆయన వ్రాశాడు. గాంధీ ఉద్యమమైన సహాయ నిరాకరణంమీద తన అభిప్రాయాలను ఖచ్చితంగా చెప్పమని అడిగినప్పుడు, ఆయన సమాధానమివ్వడంలో చాల జాగ్రత్తపడ్డాడు దూరదృష్టిలేని అలజడులు దేశాన్ని విభజించి. దేశసమైక్యాన్ని భంగం చేస్తాయని బహుశా ఆయన ఉద్దేశం. అలా కాకున్నా ఇటువంటి ప్రశ్నలు, వైష్ణవుల్లో తెంగలై-

వశగలై విభేదాలవలె నిష్ఫలంగా తయారవుతాయని భావించి ఉండవచ్చు. వైష్ణవుల వివాదం ఆ రోజుల్లో కోర్టుకెక్కి ఉండేది!

రవీంద్రనాథ టాగూర్ కవిత్వాన్ని గూర్చి ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన పొగడ్తలను భారతి హృదయ పూర్వకంగా ఆమోదించడం చూస్తే, కవిగా భారతి నిజాయితీ. గొప్పదనం మనకు అర్థం ఔతాయి. "స్వదేశ మిత్రన్" పత్రికలో ఆయన వ్రాసిన చివరి వ్యాసం టాగురు జర్మనీ, ఆస్ట్రియా, ఫ్రాన్స్ తదితర దేశాల్ని సందర్శించడం గురించి:

"ఆహా! కేవలం కీర్తివల్ల ప్రయోజనమేమిటి? నా స్నేహితు డొకాయన తన రాజకీయ పక్షం ద్వారా కీర్తి సంపాదించాడు. రేపు ఆ పక్షం నామరూపాల్లే కుండా పోవచ్చు. ఆ పక్షంలోని సభ్యులు ఎక్కడి వారక్కడ చెదరిపోవచ్చు. అటు వంటి కీర్తి వట్టిదై, ఒక పుక్కిటి పురాణంగా, ఒక రూపంలేని కలగా తేలిపోతుంది

"ఎవరైనా కీర్తి సంపాయించ దల్చుకుంటే, అది రవీంద్ర మహాశయుడు పొందిన కీర్తిలాగా ఉండాలి. అది ఒక్క వంగ దేశానికి చెందింది మాత్రమేనా? ఒక్క భారత దేశానికి పరిమితమైనదేనా? లేక ఏషియా ఖండానికేనా? ఆయన ఖ్యాతి యావద్విశాల ప్రపంచంలో పరివ్యాప్తమై, జర్మనీ, ఆస్ట్రియా, ఫ్రాన్స్ దేశాలన్నింటా ప్రాకింది. కాని ఆయన గీతాలు బెంగాలీ భాషలోనే ఉన్నాయి ప్రపంచానికి అవి అనువాదాలుగానే తెలుసు. అయితేనేం, అనువాదాలే అంత పరివ్యాప్తమైన ఖ్యాతిని తెచ్చిపెట్టినవి"

భారతికూడా చక్కని కవిత్వం చాలా వ్రాశాడు. ఐతే అప్పట్లో అది తమిళంలోకూడా ప్రచురితం కాలేదు స్వాతంత్ర్య ప్రియులూ, కవిత్వాభిమానులూ, ఆధ్యాత్మిక విషయాలలో అభినివేశం గలవారూ భారతి కవితలకోసం అనువాదాల కోసమైనా సరే, ఎగబడే కాలం ముందు ఉండినది. అప్పటికి మాత్రం భారతి ఒక పత్రికా రచయితగా నిలద్రొక్కుకొనే పరిస్థితిలోనే ఉన్నాడు చీకట్లు క్రమ్ముకొని వస్తున్నాయి 1920–21 ప్రాంతాలలో తన జీవితం అకాల సమాప్తి పొందుతుందన్న స్ఫృహ ఒక్కటి ఆయనకు కలిగినట్లు తోస్తున్నది. ఆయన రచనల్లో పారలౌకికమైన చింతన ప్రభావం తరచుగా కవిపించింది మృత్యువును గూర్చి తన రచనల్లోనూ, ఉపన్యాసాలలోను చాలసార్లు తర్కించాడు కూడా బహుశా అప్పటికి ఆ సమస్యకు పరిష్కార మార్గం లభించి, ఆయన మృత్యువు నంగీకరించే మనశ్శాంతిని పొంది ఉండాలి, ఎందుకంటే, "స్వదేశ మిత్రన్" పత్రికలో 1921

ఆగస్టు 4 వ తేదీ ప్రచురితమైన వ్యాసం ముగింపు ఇలా ఉన్నది: "ప్రహ్లాదునివలె అచంచలమైన భక్తి ప్రపత్తులనూ, మన్మధునివలె ధర్మపత్నిపట్ల గాఢానురక్తినీ, కలిగి ఉన్న మానవుడు, ఇహంలోనే ముక్తినిపొంది, దైవత్వాన్ని సాధించి, స్థిర మైన ఆనందంలో జీవిస్తాడని నా దృఢవిశ్వాసం."

ఆగస్టు మాసంలో ఒక సాయంత్రం ప్రొద్దుపోయి భారతి తిరువళిక్కేణి దేవాలయానికి వెళ్ళాడు అక్కడ ఏనుగుకి ఒక కొబ్బరికాయ అందించాడు. దుర దృష్టవశాత్తు ఆ ఏనుగు ఋతుమతి అయి ఉండడంవల్ల తొండంతో ఆయన్ని కొట్టింది. స్పృహ కోల్పోయిన భారతిని ఆయన స్నేహితుడు కువలై కణ్ణన్ రక్షించాడు. కాని భారతికి తగిలిన దెబ్బ అప్పటికే ఆయన దుర్బల దేహానికి తీరని హాని కలిగించింది. పరిస్థితి విషమించి, వైద్య సహాయం లభించినప్పటికీ, ఆయన 1921 సెప్టెంబరు 12 వ తేదీ ప్రశాంతంగా కన్నుమూశాడు. అంత్య క్రియల సందర్భంలో, స్నేహితులు శక్కరై చెట్టియార్, సురేంద్రనాధ్ ఆర్య వంటివారు మహోపన్యాసాలుచేసి జోహార్లర్పించారు. ఆయన గీతాల్ని భావో ద్వేగంతో గానం చేశారు పత్రికా సంపాదకీయాలు, ఆయన దేశభక్తి తత్పరతనూ, వేదికపై మాట్లాడేటప్పుడు ప్రదర్శించే విద్యుత్సమాన వాక్ప్రభావాన్నీ, శక్తిమంతమై స్తవనీయమైన ఆయన వచన శైలినీ, జ్యోతిస్ఫూర్తి కలిగిన ఆయన కవితనూ ప్రేమతో స్మరించాయి. ప్రతివ్యక్తీ—నిరక్షరాస్యుడైన సామాన్యుడుకూడ—ఒక లోటు, ఒక శూన్యం, తమిళుల జీవన సాహిత్యాల్లో ఏర్పడినట్లు భావించాడు. భారతి అస్తమయం అటువంటిది

మరోవిధంగా చూస్తే, భారతి మరణంలేని జ్యోతిర్మయమైన తన కవితా సంపదను మనకు యిచ్చివెళ్ళాడు. ఒక క్రొత్త ఆశనూ, క్రొత్త ఆత్మ విశ్వాసాన్నీ, వారసత్వంగా సంక్రమింపజేసి, క్రొత్త తరాన్ని, భవిష్యత్తుని ఆశాదృష్టులతో ఎదురుచూసే తరాన్ని, తయారుచేసి వెళ్ళాడు తమిళ సాహిత్య స్వరూపం ఎంతో మారిపోయింది భారతి యుగం ప్రారంభమైంది. వేలాది యువకులు తమ కరదీపి కలను భారతి రచనలనే దివిటీనుంచీ వెలిగించుకొన్నారు. తమిళ సాహిత్యరంగం పునరుజ్జీవన వికాసాలతో శోభాయమానమై విరాజిల్లింది. అది మహత్తర పునర్వి కాసం, అర్ధ శతాబ్ది గడచిన తర్వాతకూడా భారతి నేటికీ ఆధునిక తమిళ సాహిత్య సృష్టి కర్తగానే మిగిలి ఉన్నాడు.

అధ్యాయం 3

# భారతి కవితా గ్రంథాలు

భారతి పుష్కిన్‌వలె 40-వ ఏడు రాకుండానే మరణించాడు. ఆయన మరణించేనాటికి ఆయన కవితా రచనలన్నీ వెలుగుచూడలేదు ఆర్థికమైన ఇబ్బందులలో ఉన్న ఆయన కుటుంబం, కొంత ధనం వస్తుందనే ఆశతో ప్రచురణను ప్రారంభించారు భారతి తమ్ముడు, సి. విశ్వనాథ అయ్యర్ "భారతీ ప్రచురణాలయం" నెలకొల్పి భారతి రచనల్ని వివిధ సంపుటాలుగా, ప్రామాణికమైన పద్ధతిలో వెలువరించాలని ఉద్దేశించాడు. కాని సాధారణంగా కలిగే ఇబ్బందులెన్నో ఆయనకూ కలిగాయి 'కాపీరైట్'ని అతిక్రమించడాలూ, హక్కు లేకుండా ఇతరులు ప్రచురించి లాభం పొందడం వంటివి. అంతేకాకుండా ప్రభుత్వంనుంచీ కూడా బాధలు ఏర్పడ్డాయి. 2000 ప్రతులు, మద్రాసు ప్రభుత్వం విద్రోహ రచనలన్న నెపంతో, వశపరచుకొన్నది. 1928 లో మద్రాసు శాసన మండలిలో శ్రీ ఎస్. సత్యమూర్తి ఒక తీర్మానాన్ని సమర్థిస్తూ, ఉద్వేగపూరితమైన తమ భాషణంలో, భారతి రచించిన గీతాలను నిష్కర్షగా ధారాళమైన వాక్కులతో ప్రశంసిస్తూ ఇలా అన్నారు :

> "అయ్యా, కీ. శే. సుబ్రహ్మణ్య భారతి నాలుక చివర సరస్వతీ దేవి నృత్యం చేసిందని చెబితే తప్పక నమ్మవచ్చు. ఆమె చేసింది దేశభక్తి నృత్యం. ఈ భారతదేశంలో కాకుండా ఏ ఇతర దేశంలో జన్మించి ఉండినా, ఆ వ్యక్తిని ఆస్థాన కవిగా దేశం ఆదరించి ఉండేది. ప్రజల మనోభావాలను గుర్తెరిగి ప్రవర్తించే ప్రభుత్వం ఆయన్ని గౌరవాలతో బిరుదులతో సన్మానించి ఉండేది. ఆయన అత్యంతము గౌరవింపబడిన వ్యక్తిగా జీవించి మరణించి ఉండేవాడు. కాని మనం ఒక పరాధీన దేశం కావడంవల్ల, ఆయన దేశ బహిష్కృతుడుగా, పాండిచ్చేరిలో ఫ్రెంచి ప్రభుత్వపు ఆతిధ్యంలో రోజులు గడపవలసి వచ్చింది. కృంగి కృశించి మరణించవలసి వచ్చింది. కారణం ఈ ప్రభుత్వాధికారం క్రింద ఆయన వట్టి నిష్ప్రయోజకుడయ్యాడు కానీ, అయ్యా. ఆత్మత్యాగం చేసినవారూ, దేశభక్తులూ ఆయనకు పూర్వంకూడా, ఇటువంటి గతే అనుభవించి

పోయారు! సుబ్రహ్మణ్య భారతి దేశభక్తుడుగానే బ్రతికి నిష్క్రమించాడు. అధ్యక్ష మహాశయా, నేను మళ్లీ చెబుతున్నాను—తమిళ భాష ఉండే అంతకాలం, మీరు పుస్తకాల ప్రతుల నన్నింటినీ వశపరచుకొని మాయం చేసినప్పటికీ, పవిత్రమైన వేదాలు తరంనుంచీ తరానికి పరంపరగా సంక్రమిస్తూ వచ్చినట్లే, యుగయుగాల వరకూ, వ్రాత మూలకంగా ఒక ముక్క లేకపోయినా ప్రాచీనులైన మా పూర్వుల ధారణాశక్తి వల్ల అవి సంక్రమిస్తూ వచ్చినట్లే, మెకాలే పండితుడు మిల్టన్ కవీంద్రుని "పారడైజ్ లాస్ట్" కావ్యాన్ని ప్రతిపదమూ వల్లించగలిగినట్లుగానే, తమిళుడైన వాడొక్కడు ప్రాణంతో నిలిచి ఉండేంతవరకూ, ఈ గీతాలు, ఈ రచనలు. తమిళజాతి యొక్క అమూల్యమైన వారసత్వ సంపదగా నిలిచే ఉంటాయని నేను ఘంటాపథంగా చెప్పగలను."

ముప్పై ఏండ్ల అనంతరం స్వాతంత్ర్యం సిద్ధించడంతో, భారతి గీతాలకు గిరాకీ పెరుగుతూ వచ్చింది. అదృష్టవశాత్తూ, మద్రాసు ప్రభుత్వం 'కాపీరైట్' ను సంపాదించి, మహత్తరమైన ఈ వారసత్వాన్ని తమిళ ప్రజకు ఉదారమైన కానుకగా అందజేశారు. వెంటనే చౌకధరల్లో ఎన్నో పుస్తకాలు ప్రచురింపబడినవి. వాటిలో 'శక్తి కార్యాలయం'వారు ప్రచురించిన సంపూర్ణ రచనల సంపుటి, రూ 1-50 ధరతో, వేలాది ప్రతులు అమ్ముడుపోయింది. పరలి ఎస్. నెల్లి యప్పర్, ఆర్. ఎ. పద్మనాభన్ గారలు భారతి రచనల్ని సేకరించి సంరక్షిం చడంలో ఎనలేని సేవ చేశారు వారి తోడ్పాటుతో భారతి కవిత్వ రచనలు నాలుగు భాగాలుగా వింగడింపబడి సులువుగా వెదుక్కోవడానికి, క్రమబద్ధంగా అధ్యయనం చెయ్యడానికి, వీలు కల్పింపబడింది భారతిని గురించి వ్రాసిన రచయితలందరూ ఈ విభజన చక్కగానూ హేతుబద్ధంగానూ ఉన్నదని అంగీకరించి ఉన్నారు

## విభాగం 1 : దేశభక్తి గీతాలు

1. భారత వర్ష గీతాలు
2. తమిళనాడు పాటలు
3. స్వాతంత్ర్యం
4. స్వాతంత్ర్యోద్యమ గీతాలు
5. జాతీయ నాయకులు
6. విదేశాలలో స్వాతంత్ర్యోద్యమాల మీద గీతాలు.

## విభాగం 2 : భక్తి గీతాలు

1. ప్రార్థన గీతాలు
2. జ్ఞాన గీతాలు

## విభాగం 3: గీత కదంబం

1. ధర్మం (నీతి)
2. సమాజం
3. వివిధ గీతాలు
4. సంస్మరణ (ప్రశస్తి)
5 ఆత్మకథ
6 వచన పద్యాలు.

## విభాగం 4 : మూడు గొప్ప కావ్యాలు

1. కణ్ణన్ పాట్టు (కృష్ణ గీతాలు)
2, పాంచాలి శపథం (ద్రౌపదీ విజయం)
   ఆశ్వాసం 1 : దుర్యోధన వ్యూహం
   ఆశ్వాసం 2 : పాచికల ఆట
   ఆశ్వాసం 3 : పరాధీనత
   ఆశ్వాసం 4 : ద్రౌపదీ మానభంగం
   ఆశ్వాసం 5 : ద్రౌపది శపథం
3. కుయిల్ పాట్టు (కోయిల పాటలు)

భారతి ప్రధానంగా గీత రచయిత. మొదటి మూడు విభాగాలలోని కవితలన్నీ ఇంచుమించు పాటలే. చిన్నవీ, పెద్దవీ సగటున 20 పాదాల నిడివి కలిగిఉంటాయి. కొన్ని మరీ చిన్నవి. విద్యుచ్ఛక్తి గర్భితమైన చిరు గుళికల్లాంటివి. ఉదాహరణకు "నిప్పు రవ్వ" చూడండి :

"నాకో నిప్పురవ్వ దొరికిందీ, చిన్నారి నిప్పు!
అడివి చెట్టు తొర్రలో దాన్ని రాల్చానో లేదో,
అడివి బూడిదయింది !

హా హా!

హా హా!

పెద్దా చిన్నా, గొప్పా కొద్దీ ఏమున్నాయ్

అన్నిటినీ హరించే నిప్పు ముందట ?''

''కణ్ణన్ పాట్టు'' నాటకీయత గల గీత సముదాయం. ''కుయిల్ పాట్టు,'' ''పాంచాలీ శపథం'' వంటి దీర్ఘ కథా కావ్యాలుకూడా, గీతికా తరంగాలుగానే మనకు తోస్తాయి. ఒక్కొక్క పద్య సముదాయం దాని వరకు అది సంపూర్ణత్వాన్ని కలిగి ప్రత్యేకంగా ఉన్నట్టే ఉంటుంది. ఐనప్పటికీ కథాకథన శక్తిలో ఆయన అద్వితీయుడే. ''గురు గోవింద్'', ''ఆత్మకథ'', ''భారతి అరవై ఆరు'', ఆయన రచనల్లో మణిపూస అయిన ''కోయిల పాటలు'', యివి అన్నీ అందుకు తార్కాణం

## అధ్యాయం 4.

## దేశభక్తి కవితలు

భారతి మొదట్లో దేశభక్తుడైన కవిగా ప్రసిద్ధిపొందాడు స్వయంగా ఆయన గొంతువిప్పితే నిండుగానూ ఉజ్జ్వలంగానూ ధ్వనించేది. ప్రజాసమూహాల్ని, తన పాటల్లో భారతదేశ బహుముఖ సంస్కృతిని గొంతెత్తి కీర్తిస్తూ, ఉర్రూతలూపే వాడు. రాజకీయమైన అవమానాలూ, కష్టాలూ, దేశ పరాధీనతా, త్వరలోనే ఉజ్జ్వలమైన భవిష్యత్తు వేచియున్నదన్న ఆశాభావమూ, ఆ పాటలలో అభివ్యక్త మయ్యేవి ఇటువంటి దేశభక్తి కవితలు స్వతంత్ర భారతదేశంలో కాలదోషం పట్టిన రచనలు కదా అన్న సందేహాన్ని కొందరు వ్యక్తంచేస్తారు. నిజానికి భారతి దేశభక్తి కవితలు, అలాంటిగతి పట్టకుండా తప్పించుకొన్నాయి; మరచి పోవడ మనే శాపం వాటికి వర్తించదు కారణం, ఆయన సంకుచితమైన ఉద్రేకాన్నీ, స్వోత్కర్షనూ, పక్షపాత వైఖరినీ, కన్నీళ్ళుకార్చే ఆత్మహైన్యపు జాలినీ దరికి రానీయలేదు. ఆయన మూలతత్త్వాన్నే అన్వేషించాడు. విముక్తి కలిగించే

చైతన్య స్థితినిగూర్చి గానం చేశాడు. మానవ చైతన్యం యొక్క అనంతమైన స్వేచ్ఛకు స్ఫూర్తిగల వాక్కులో అభివ్యక్తి కలిగించాడు. ఈనాడు మనం రాజకీయ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నప్పటికి అల్లిబిల్లిగా అలముకొన్న ఎన్నోరకాల పరాధీనతల్లో బంధింపబడి ఉన్నాం గనుక, ఆయన భావాలూ, ఆవేదనలూ ఎలా సందర్భ శుద్ధితో మన హృదయాల్ని స్పృశిస్తున్నాయో గమనించవచ్చు.

ఆయన దేశభక్తి కవిత వ్రాయడానికి ప్రధానంగా ప్రేరణ బంకిం చంద్రుని "వందేమాతరం" గీతం నుంచీ లభించింది అప్పట్లో ఆ గీతం, 'బెంగాల్ విభజన' తరువాత, జాతీయ వాదులకూ, విప్లవకారులకూ, పవిత్రమైన మంత్ర జపం అయిందనే చెప్పాలి. శ్రీ అరవిందులు యిలా అన్నారు :

"ఆ 'మంత్రా'న్ని ఇవ్వగానే ఒక్క రోజులో ప్రజానీకం యావత్తూ దేశభక్తి అనే మతాన్ని స్వీకరించింది వారికి మాతృదేవత సాక్షాత్కరించింది. ఆ దివ్య దర్శనం పొందిన ప్రజలు విరామమెరుగక, శాంతి సుషుప్తులను మరచి, దేవాలయ నిర్మాణానికి, మూర్తి స్థాపనకూ, త్యాగనివేదనకూ సంసిద్ధులయ్యారు."

'వందేమాతరం' అన్న మాటల మంత్రోచ్చారణతో తమిళ పునరుజ్జీవనం సాధించడానికి సుబ్రహ్మణ్య భారతి జాతీయవాదమనే విజయ ధనుష్టంకారం చేశాడు :

"విజయమో, అపజయమో,
మృత్యువో, అదేమైతేనేం!
మేం సమైక్య నాదంతో
గొంతెత్తి పాడుతాం!
వందేమాతరం!"

బంకిం చంద్రుని "ఆనందమఠ" నవలలో, ఏ సందర్భంలో ఆ గీతం కూర్చబడిందో, తమిళ ప్రజలకు భారతి తెలియజెప్పాడు అంతే కాకుండా, బంకిముని అమర గీతం యొక్క ప్రశస్తిని వర్ణిస్తూ తానొక కవిత వ్రాశాడు :

"ఆర్యామాతను అల్లుకొన్న
ప్రేమ లత నవసి నశిస్తుంటే,
వందేమాతరం వర్షించింది,

తొలకరిగా తోచింది!
గగనోత్తుంగ భారతమాత
మంత్రం వందేమాతరం!
కారు చీకటి క్రమ్మివేసి
మాతృదేశపు జవసత్త్వాలను
మాటు గొల్పితే,
వందేమాతరం వచ్చింది!
బంగాళా ఖాతంలో
ఉదయించే సూర్యునిలావచ్చింది!
జయోస్తు! మంత్రమా!
ఆర్యాదేవి భారత మంత్రం
వందేమాతరం!"

గాఢానురక్తుడైన జాతీయ వాదిగానూ, తీవ్ర రాజకీయవాదుల అభిమానిగానూ, భారతి తన శ్రోతలను ఉగ్రరూతలూపేవాడు. బ్రిటిషువారినీ, మితవాదులనూ, తీవ్రంగా విమర్శించి దుయ్యబడుతూ, స్వాతంత్ర్య యుద్ధంలో ముఖ్యఘట్టాలను నాటక రమ్యంగా చిత్రిస్తూ ఉండేవాడు. అటువంటిదే అయిన కర్నల్ వించ్-వి. ఓ చిదంబరం పిళ్ళైల మధ్య సంభాషణ ఒకటి చాలా ప్రసిద్ధి చెందినది. పిళ్ళై ఒక నూనె మిల్లులో పనిచేయవలసివచ్చింది. ఒక అధికార గర్వితుడు చేజిక్కిన వాళ్ళను లొంగదీసుకోవటానికి ఎలానైనా హింసించే హక్కు తనకు ఉన్నదని వాదిస్తే, పోరాటానికి సిద్ధపడిన దేశభక్తుడు తన బానిస బంధాలను, ఏమైనా సరే త్రెంచుకోవడానికి అలానే తన కృతనిశ్చయాన్ని చెబుతాడు. మందులైన కొందరు భారతీయులు బానిసత్వంలోపడి పందుల్లా మురికి కాలువలో పొర్లాడుతూ సంతోషించడాన్నీ వారిదైన తామసిక హ్రస్వ దృష్టినీ, కోపంగా విమర్శించిన కవితలూ ఉన్నాయి. ఈ అప్రయోజక మృత జీవుల బారినుంచీ మాతృదేశాన్ని తప్పించాలంటాడు భారతి :

"ఓ భుజబలం లేని దిష్టి బొమ్మా,
వద్దు పో, వద్దు పో!

ఓ గుండెలు క్రుంగిన శాస్త్రీ,
వెళ్ళు, వెళ్ళు!
ఓ జీవకళ లేని ముఖమా,
తొలగిపో, తొలగిపో!
ఓ కాంతి లేని గాజు కళ్ళూ
కనిపించకు, కనిపించకు!''

ఆదర్శ దేశభక్తుణ్ణి చూచి "అంధకారా వృతభూమిపై ఉదయించే భాస్కరుని''గా భారతి ఆదరంతో స్వాగతం పలుకుతున్నాడు అంధకారం తాత్కాలికమే భారతి వ్రాసిన దేశభక్తి కవితల్లో చాలవరకు, భారతదేశ గత వైభవాన్ని ప్రకాశాన్ని వర్ణిస్తూ, సముజ్జ్వలమైన భవిష్యత్తుని అనంత దీర్ఘవాసరంగా ప్రదర్శించేవి ఉన్నాయి. ఈ అచంచల విశ్వాసం ఆయన గీతాలకు అనశ్వర భారత వైభవాన్ని కీర్తించే విజయ గీతికల స్థాయినీ అమరత్వాన్నీ చేకూర్చుతున్నది జన్మభూమియైన తమిళనాడుమీద ఆయన కపారమైన ప్రేమ; మాతృభాషకు ఆయన హృదయాన్ని అర్పించాడు; అది ఆయనకు ఆనందహేతువైన 'ద్రాక్షాసవం'; తమిళ కవుల్నీ, మేధావుల్నీ, జాతి నిర్మాతల్నీ ఆయన ఎంతో అభిమానించాడు; కాని తమిళనాడు సరిహద్దుల్ని దాటికూడా ఆయన దృష్టి సారించాడు; భారతదేశ సమగ్ర స్వరూపాన్ని దర్శించాడు; భారతదేశమే 'మాత'; కవిత తర్వాత కవిత ఈ భావాన్ని, ఈ ప్రత్యక్ష యధార్థాన్ని, అంటే సమైక్య భారతాన్నే సముజ్జ్వలంగా దీప్తిమంతంచేస్తూ వచ్చింది :

''ఉత్తుంగ హిమవన్నగము మాదీ-
భూమిపై దానికి సాటి ఏదీ?
పావనోదార గంగ మాదీ-
అందాన దాని సాటి నది ఏదీ?
పవిత్రమైన ఉపనిషత్తులు మావీ-
వాటి బోలు మతగ్రంథాలు పేర్కొనగ నేవీ?
స్వర్ణారుణ కిరణ రంజిత భూమి మాదీ
ఆమెకామెయే సాటీ, కొనియాడుదాము రండీ!''

భారత దేశంలో ఎన్నో తెగలున్నాయని భారతికి ఎరుకయే. దేశ సంక్షేమం కోసం వాటి సమైక్య కృషి అవసరమని ప్రబోధించాడు ఆయన పైకి కనిపించే వైవిధ్యాల్ని ఏకంచేసి బంధించే బంధనాలు ఒక్క ప్రేమబంధాలేననీ, వాటి మూలంగా అందరూ తల్లి భారతికి సన్నిహితులేననీ ఆయన అన్నాడు:

''ముప్పై కోట్ల ముఖాలున్నాయి ఆమెకు,
కాని హృదయం ఒక్కటే.
పద్దెనిమిది భాషల్ని మాట్లాడుతుందామె,
కాని ఆమె మనస్సు ఒక్కటే.''

ఛత్రపతి శివాజీ, గురుగోవింద్, దాదాభాయి నౌరోజీ, బాలగంగాధర తిలక్, లాలా లజ్‌పత్‌రాయ్ — ఎవరైతేనేం. అంతస్థమైన ఆత్మ ఒక్కటే, వాళ్ళు పాడిన పాట ఒక్కటే, అదే స్వాతంత్ర్య గీతి తన్మూలంగా సుబ్రహ్మణ్య భారతి కవితలు, స్వాతంత్ర్య భావననుగూర్చి వ్రాసినవి. ఎప్పటికీ కాలదోషం పట్టేవికావు. అందులో, దేశభక్తి పూరితుడైన కవి స్వాతంత్ర్యం కోసం తాను ఆర్తి చెందడమే కాదు, దాని అమృతప్రాయమైన మధురిమనుగూడ మారుమూలల్లో ఉన్న శ్రోతలకు పంచి పెట్టడం మనకు గోచరిస్తుంది. ఈ క్రింది పద్యం వంటివి చూస్తే వాటికవే ఒక విశిష్టమైన గీతావళిగా ఉన్నాయి:

''స్వాతంత్ర్యం కోసం అర్థించేవాళ్ళూ
ఏవో వరాలిస్తే ఊరుకుంటారా?
అమృతం కోసం అర్రుజాచినవాళ్ళూ
సారాయి కోసం సాగిలపడతారా?''

స్వాతంత్ర్య వృక్షం అంతసులువుగా పెరగదు. తరాలు గడిస్తేగాని స్వాతంత్ర్య చేతన ప్రజల్లో పాదుకొనదు. అలాంటప్పుడు ఆ మొక్కని ఎదుగకుండా వాడిపోయేలా చేయడం ఎంతబుద్ధి తక్కువ పని:

''మా ఆలోచనల నేతులు పోసి వెలిగించాం
ఈ సుందర దీపాన్ని
మా ఆత్మాలయ ప్రాంగణాన-
అది కొండెక్కితే చూడగలమా?''

ప్రజా విశ్వాసం మారగొన్న నాయకుల్ని వేలాదిమందిని జైళ్ళలో మూసివేయడం ద్వారా దేశ పరిపాలన సాగదు. అటువంటి అత్యాచారాలు జరిపే ప్రభుత్వ యంత్రాంగం చాలకాలం మనుగడ సాగించలేదు. యంత్రాంగం ద్వారా బంధితులైన "శామ్సన్"వంటి వీరులు బానిసత్వానికి ఎన్నడూ తల ఒగ్గలేరు; వారు స్వాతంత్ర్య మాత అనుంగు భక్తులు, అచంచల దీక్షాపరులు :

"ఆలు బిడ్డల అనురాగాలకు దూరమైతేనేం?
చీకటి గదుల్లో కృశించితేనేం?
ఆనంద సమయాన్ని అంధకారపు రోజులుగా
బలవంతాన మార్చితేనేం?
కోట్లకొద్దీ బాధలెన్నో నన్ను
కూడి మాడ్చితే నేం?
స్వాతంత్ర్యదేవీ, అమ్మా,
మరువను తల్లీ!
నీ చరణ పూజ
మరువను తల్లీ!

స్వాతంత్ర్యం మేధావి వర్గానికి చెందిన ఒక విలాస వస్తువు మాత్రమే కాదు, అది అన్నివర్ణాల వారికీ, అన్ని వర్గాలవారికీ, అందరు ప్రజలకూ, అన్ని జీవన పరిస్థితులలోనూ, ప్రధానమైన అవసరమే! భారతి దృష్టిలో స్వాతంత్ర్యం ఒక సమగ్ర శక్తి, ఒక సంపూర్ణ వరం; అది అన్ని రకాల బాధలనుంచీ పొందవలసిన విముక్తి. స్త్రీలు కూడా, ముఖ్యంగా స్త్రీలు, సామాజిక నిర్బంధాలనుంచీ నిషేధాలనుంచీ విముక్తులై, పురుషులతో భాగస్వామినులుగా, స్వతంత్ర భారత నిర్మాణంలో పాలుపంచుకోవాలని ఆయన ఉద్దేశం. ఆ స్వప్నం అనతికాలంలోనే ఫలిస్తుంది :

"రండి, అందరూ కలిసి కష్టిద్దాం రండి!
ఏదీ దాచుకోకుండా, ఎవరినీ నొప్పించకుండా,
సత్యం జ్ఞానం మార్గంగా పయనిద్దాం!

హీనులెవ్వరూ ఉండబోరు,
దీనులెవ్వరూ మిగులబోరు,
భారతంలో ప్రభవిస్తే,
అందరిదీ ఆభిజాత్యమే!''

## అధ్యాయం 5.

## భక్తి గళము

దేశాభిమాని ఐనప్పటికీ సుబ్రహ్మణ్య భారతి తన దేశభక్తి కవితకు సామాజిక ఆధ్యాత్మిక చైతన్యాన్నే మూలాధారంగా స్వీకరించాడనే విషయం మనం గుర్తుంచుకోవాలి రాజకీయ స్వాతంత్ర్యం, సామాజిక - ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాలకు దారితీసినప్పుడే అది వాంఛనీయ ఫలమౌతుందని ఆయన గ్రహించాడు కాని కేవలం మాటల్లో, దాన్ని పదే పదే చెప్పడంలో, అటువంటి స్వచ్ఛందమైన ఆనందం మనకు లభ్యంకాదు స్వాతంత్ర్యేచ్ఛ ప్రజల రక్తనాళాల్లో పరుగులెత్తే నైసర్గిక పిపాస కావాలి. బంకిం చంద్రుని "వందేమాతరం" ఈ విధంగానే మనల్ని తాకి ప్రభావితుల్ని చేస్తున్నది. ఆ పాట రాగతాళ గాంభీర్యంలో కేవలం రాజకీయ ప్రచారాన్ని అధిగమించిన ఒక శక్తి అపారమై ఉన్నది. భారతి కవితల్లో కూడా అటువంటి ఆధ్యాత్మిక విముక్తి కలిగించే 'హాయి'ని చేకూర్చగల శక్తి ఉన్నది:

''ద్వేషాన్ని జయించి
భయాన్ని భంజించి
పలుకుమురా భారతనామం, పలుకుమురా!
మ్రోగించు ఢంకా!
మ్రోగించు విజయ ఢంకా!

భయమనే రాక్షసుని గెలిచి
అసత్యమనే సర్పాన్ని చంపి,
మనం వేదమార్గాన్ని ఎంచుకున్నాం
అదే బ్రహ్మజ్ఞానానికి బాట!''

భయంనుంచీ దూరమై స్వేచ్ఛను పొందడానికి మొదటి మెట్టుగా, భారతి వివిధ మతాలకు చెందిన దైవాల్నీ ప్రార్థించి దయజూపమంటాడు (అల్లా, క్రీస్తులనూ ఇతర దైవాలతో కలిపి). వారిని మనస్సుకీ ఆత్మకీ శక్తి చేకూర్చమంటాడు ఇటువంటి దైవభక్తి కవితలు, భారతి వ్రాసినవి, ఈ 50 ఏళ్ళుగా ప్రజాదరణ పొందుతూనే ఉన్నవి గణపతినీ సుబ్రహ్మణ్యునీ గూర్చి ప్రేమతో అర్థిస్తూ, కవి తన హృదయంనుంచీ భయాన్ని దూరం చెయ్యమంటాడు. సుబ్రహ్మణ్యుడనగా హృదయ కుహరంలో ప్రజ్వలించే అగ్నికావడంవల్ల, భక్తుణ్ణి ఏ భయమూ స్పృశింపలేదంటాడు. కృష్ణుడు, లక్ష్మి, సరస్వతి, సూర్యుడు ఈ దేవతలందరూ సంరక్షకులే 'మహాశక్తి', అంటే సృష్టికి మూలమైన ఆదిశక్తినిగూర్చి కవి పాడినప్పుడు మాత్రం తన ప్రత్యేకతనూ అహంకారాన్నీ మరచి పూర్తిగా ఆత్మ సమర్పణలో లీనమౌతాడు.

"శక్తి"ని గూర్చిన గీతాలు భారతి దైవభక్తికి మూలకందం కలకత్తాలో సోదరి నివేదితను దర్శించినప్పుడు భారతి విశ్వజనని సాక్షాత్కరించిన అనుభూతి పొందినట్లు తోస్తుంది "స్వదేశ గీతంగళ్" గ్రంధానికి ఆయనవ్రాసిన అంకితం వాక్యాలు అందుకు తార్కాణం: "కృష్ణుడు అర్జునునికి విశ్వరూప సందర్శనం ప్రసాదించినట్లు, భారతదేశ జనయిత్రి నిజస్వరూపాన్ని నాచే దర్శింపజేసి, నాకు మాతృదేశ భక్తిని నేర్పిన గురువు చరణ సన్నిధికి చిన్ని గ్రంధం."

ఆయన దేశభక్తి కవితలు భారతదేశాన్ని మాతృశక్తిగా భావిస్తూ రచించినవే కాదు, ఆయన దైవభక్తి కవితల్లో ఎన్ని పొరలున్నావాటి అన్నింటి క్రిందా 'శక్తి' తత్త్వమే గోచరిస్తున్నది. 'శక్తి' ఎన్ని రూపాల్ని ధరించినా విశ్వమూలకమైన సత్త్వం ఒక్కటే:

"కొందరు నిన్ను ప్రకృతిగ వర్ణిస్తారు,
మరి కొందరు నిన్ను పంచభూతాల్లో దర్శిస్తారు:

కొందరు నిన్ను మూలశక్తితో సమానం చేస్తారు,
మరి కొందరు నిన్ను అగ్ని, వివేకం, దైవం అంటారు".

శక్తి 'ఇష్టదేవత' ఐనప్పుడు సర్వమూ మంగళ ప్రదమే ఔతుంది:

"సుళ్ళు తిరిగే నడి సంద్రంలో
ఆమె దయ మనకు నావ:
భయం లేకుండా దూర తీరాన్ని చేరుతాం.
శక్తి చరణాలకు ప్రణమిల్లుదాం.
భయపడకు, హృదయమా!
విజయం మనదే!"

భారతి చేసిన వేదాధ్యయనం ఆయన కవితలమీద తన ముద్రవేసింది సూర్యుణ్ణి గురించీ, హోమాన్ని గురించీ వ్రాసిన పద్యాలు వేదాంత పద్యాలు. మృత్యువును తిరస్కరిస్తూ, దాన్ని ఒక "కలుపు మొక్కగా" తృణీకరిస్తూ వ్రాసిన గీతం మరొక ఉదాహరణ ఎందరో దేవతల్ని గురించి ఉత్సాహంతో పాడగల్గిన కవియైగూడ ఆయన ఏదో ఒక దైవ నామాన్నే పట్టుకుని దివ్యత్వాన్ని గూర్చిన పురాణాల, శాస్త్రాల అరణ్యంలో దారి తప్పడం కంటే బుద్ధి తక్కువ పని వుండబోదని బాగా ఎరిగినవాడు జ్ఞానమే భగవంతుని స్వరూపం, జ్ఞానమే మాయను తొలగిస్తుంది; జ్ఞానమే జిజ్ఞాసువునకు ఆత్మప్రకాశాన్ని కలిగిస్తుంది:

"ఏది జ్ఞాన సిద్ధి?
అది ఆందోళన లేని మనఃస్థితి!
వదరుతూ ఉండటమేనా ఎడతెగక,
నెమరువేసే పశువులాగ?
లోలోపలి ఆత్మ
గుండెను వెలిగిస్తే
అదే బ్రహ్మం-
అంటుంది శాస్త్రం."

చివరి సంవత్సరాల్లో భారతి కేవలం 'జ్ఞాని'గా మారాడు ఆయన దైనం దిన వ్యవహారాల్లో, సమాజంలో మామూలుగా కనిపించే వ్యాపార సరళిగాని బేరసారాల తాలూకు తర్కం . ని కనిపించేది కాదు దుస్తులూ వేషధారణా గురించిన పట్టింపు పోయింది; ఉత్తేజ పూరితమైన సంభాషణల్లో మధ్య మధ్య సుదీర్ఘమైన మౌనం పరిపాటి ఐంది. ఆయన మెరిసే కళ్లల్లో అంతులేని ఆధ్యాత్మిక చైతన్యం, ఉద్వేగపూరితమైన చిత్తవృత్తిని అదుపులో పెట్టి ఉంచిన ఆత్మశక్తి గోచరించేవి "చిత్తవృత్తి భామ" అనే చక్కని కవితలో భారతి తనని కవ్వించే ఆ సుందరితో తంటాలు పడుతూ తనని ప్రశాంత స్థితిలో వదలి పెట్టమని ఆమెని ఆర్థిస్తాడు. లేక, బహుశా, అతని మనస్సే అతని చిత్తవృత్తిని మార్చడంలో విజయం పొంది ఉన్నతస్థాయిని — "అతిమానస" స్థాయిని చేరుకుంటుంది :

"ఓ చిత్తవృత్తి భామా! ఆలించు!
నాకు తెలీదు
నీతో ఎలా ఉండాలో,
కాని ఎప్పుడూ అనిపిస్తుంది
నీతోటే ఉండాలని.
నువ్వు పెరిగేలా ప్రయత్నిస్తాను
జ్ఞాన సిద్ధి సాధిస్తాను
నేను చూచాను పరమార్థాన్ని—
నువ్వు చూడలేదు దాన్ని.
నిత్య సమర్చన కోరుతుందది
దాని ద్వారానే
నువ్వూ తరిస్తావు."

# అధ్యాయం 6.

## కృష్ణ గీతావళి

"పాండిచ్చేరిలో వున్న రోజుల్లో భారతికి పద్దెనిమిదవ శతాబ్ది వైష్ణవ కవులైన ఆళ్వారుల భక్తి తత్త్వంతో సన్నిహిత పరిచయం ఏర్పడింది దానికి దోహదం చేసింది కువలయూర్ కృష్ణమాచారియర్ (కువలై కణ్ణన్)తో ఆయన కేర్పడిన గాఢమైత్రి పెరియాళ్వార్ రచించిన "పాసురము"లు లేక పదావళి భారతిని ప్రత్యేకంగా ఆకర్షించాయి. అందులో కృష్ణుని బాల్యం హృదయం గమంగా వర్ణింపబడింది. భారతి సంగీత జ్ఞానమూ, భావ స్ఫోరకంగా గానం చేయడంలో ఆయన కౌశలమూ కలిసి "కణ్ణన్ పాట్టు" అన్న గీతావళిగా సృష్టి జరిగింది అలరించే సంగీతమూ, ప్రాంతీయ సహజమైన గేయ సరళీ, పద బంధాల్లో అందంగా మేళవింపై, ఒకానొక నిర్మల నిరాభరణ సౌందర్యం ఈ గీతాలను పరివేషించి వున్నది. వి. వి ఎస్ అయ్యర్ ఈ పాటల రెండవ కూర్పు నకు తొలి పలుకు వ్రాస్తూ చెప్పిన మాటలు అతిశయోక్తులు కానేకావు

"ప్రశాంత సంధ్యావేళ, సముద్రతీరం వెన్నెల్లో స్నానమాడి, నీలికడలి సర్వమూ పాల కడలిగా భాసించే వేళ, ఈ కవి తన గళమెత్తి, భావనాగర్వంతో సృజనోత్సాహంతో క్రొత్త పాటల్ని గానం చేస్తూవుంటే విన్నవాళ్ళకు, ఈ గ్రంథం లోని ప్రతి గీతమూ ఒక వెలలేని రత్నమే"

ఇందులో ఇరవైమూడు గీతాలున్నాయి సర్వవ్యాపియైన భగవంతుణ్ణి మనకు తెలిసిన మానవ రూపాల్లో, సంబంధాల్లో - తండ్రులు, పుత్రులు, ప్రేమి కులు, స్నేహితులు, యజమానులు, సేవకులు అన్న వివిధ రూపాల్లో అన్వే షించి, ఆశ్రయించడమే ఈ గీతాల ఇతివృత్తం. ఇది సాహసవంతమైన, అసాధారణమైన ప్రయోగం. పెరియాళ్వారు భగవంతుణ్ణి శిశువుగా ప్రియునిగా మాత్రమే దర్శించి చేసిన రచనా పరిధులుదాటి, చాల దూరం అధిగమించిన ప్రయోగం.

దైవాన్ని ఆశ్రయించేలో మార్గాల నాయక - నాయికా భావం, భారతీయ భక్తి సంప్రదాయంలో ఎప్పుడూ వున్నదే. ఉత్తర దక్షిణ భారతాల్లో వైష్ణవ భక్తుల పాటలూ, విద్యాపతీ బిల్వమంగళుల కవితలూ, జయదేవుని "గీత

గోవిందం'' కావ్యంగా పర్యవసించినవి కాని భారతి రచనల్లో క్రొత్తదనం ఉన్నది పాతవడిన భావచమత్కారాలనూ, కవితా సామగ్రినీ ఆయన ఉపయోగించలేదు (చందనము, నెమలి పింఛము, కౌస్తుభము వంటివి). అంతకంటే ఆ అనుబంధంలోని విశ్వజనీనమైన హృదయానుభూతికి ఎక్కువ ప్రాధాన్యం యిచ్చాడు జీవనానుబంధియైన తలపుల పరంపరకూ, పరిసర వస్తువులకూ అభివ్యక్తి కల్పించడం ద్వారా, ఒక నిర్దిష్ట మనఃస్థితిని ఆవిష్కరించే ప్రయత్నం మనకు కనిపిస్తుంది :

''గాలం తుదను ఎరలా
గాలిలో దీపకళికలా
నా హృదయం రెపరెప లాడింది
అనంతకాలం.
పంజరంలో చిలుక లా
ఏకాకినై దుఃఖించాను.
మధురాతి మధురమైన వన్నీ
నాకు చేదై పోయాయి.''

విరహార్తి చెందిన హృదయం కలలో గాంచిన దృశ్యంతో చైతన్యవంతమై మేల్కొంటుంది. దాన్ని గురించి :

''మళ్ళీ ఒకసారి తలపులో గుర్తువచ్చి
ఆ అద్భుత స్పర్శ, ఆ లాలిత్యం,
వళ్ళంతా పులకింప జేస్తే,
వినూత్న ప్రశాంతి నన్నలముకొన్నది.
అన్వేషించాను హృదయంలో,
ఎవరై వుంటారని ప్రశ్నించాను.
అహో! కృష్ణుని దివ్య సుందర రూపం
నా కళ్ళెదుట నిల్చింది'',

భారతి గీతాల్లో కృష్ణుడు ప్రేయసిగా, ప్రియురాలు కణ్ణమ్మగా మారడం ఉన్నది :

''జ్యోతుల్లాంటి ఆ కళ్ళు, కణ్ణమ్మా!
సూర్య చంద్రులా?
ఆ నల్లని కనుపాపల్లో, కణ్ణమ్మా!
నీలాకాశపు జాడలా?
అంధకారంవంటి ఆ పట్టు చీరపై
మెరిసే రత్నాల బుటాలు
అర్ధరాత్రి అంబరంలో
తారకా గుచ్ఛాలా?''

ఈ ప్రియురాలు వెంటనే సంరక్షకురాలై 'మహాశక్తి' రూపంలో కూడా కనిపిస్తుంది. ఇలా గాజు గొట్టంలో రంగులు మారినట్లు, త్వరిత గతిని గోచరించే మార్పుల్లో మనకొక నాటకం, మనమే అందులో భాగమైన నాటక ప్రదర్శనం, కన్నుల గట్టుతుంది కృష్ణుడు ఒకచోట పురాణ వీరుడు; అర్జునునికి సుభద్రనిచ్చి పెళ్లి చేయడం చూస్తాము ఆ కృష్ణుడే, హృదయాధి దేవతయై అతనితో ఐక్యం పొందాలనే మనలోని కోరికలతో దాగుడుమూత లాడటమూ కన్పిస్తుంది అటువంటి ఐక్యానుభవం తరువాత 'నేను' అనేది 'నువ్వు'నుంచి విడిగా ఎలా ఉండగలదు?

''వలపించిన మోము మరచాను—
ఓ చెలికాడా! ఈ మాటెలా చెప్పగలను?
ప్రేమించిన హృదయం మరచిపో లేదు—
ముఖాన్ని తలపు ఎలా మరువ గలిగిందో?
మధుపం మధువుని మరచిపోవడం,
పువ్వు వెలుగుని మరచిపోవడం,
ధరిత్రి ఆకాశాన్ని మరచి పోవడం—
అటువంటివికూడా సంభవమా జీవితంలో?''

కృష్ణుడు కృష్ణుడే కాదు, మాతృదేవతయైన కణ్ణమ్మ; భారతి హృదయాధిష్ఠాన దేవతయైన సంరక్షకురాలు కూడ. అందువల్లనే ఈ గీతా గుచ్ఛం చిట్టచివర, వళ్లు

పులకింపజేసే పాటలో, కవి అన్ని ధర్మాలనూ పరిత్యజించి, మాతృదేవతలోనే సంపూర్ణ శరణాగతి పొందుతాడు :

"పరాధీనతా, భయమూ, నా గుండెలో కాపురంపెట్టాయి
వాటిని అంతంచేసి తొలగించడానికే
శరణాగతి!
తల్లీ, ధర్మమేదో అధర్మమేదో తెలియని మాలో
ధర్మాన్ని నిలిపి అసత్యాన్ని తొలగించు -
శరణాగతి!"

## అధ్యాయం 7.

# ద్రౌపది విజయం

భారతదేశ ప్రాచీన సాహిత్యము, బహుముఖ విస్తారమూ వైవిధ్య సంపన్నమూ అయినట్టిది. యుగయుగాలుగా భారతీయ కవులు జాతియేతిహాస కావ్యాలైన రామాయణ, మహాభారతాలను, మూలాధారం చేసికొని రచనలు చేశారు ఏదైనా సంక్షోభమో, సంక్లిష్ట పరిస్థితియో, ఎదురైనప్పుడు తెలిసిన పురాణగాధను ఆనాటి పరిభాషలో మళ్ళీ చెప్పుకోవడం వాళ్ళుచేసే ప్రధమ ప్రక్రియ. ఈ శతాబ్ది తమిళ సాహిత్యంలో అటువంటి కావ్యాలలో అత్యంత శ్రేష్ఠమైనది సుబ్రహ్మణ్య భారతి కలం నుంచీ వచ్చింది.

పాండిచ్చేరిలో తానుగా మాతృభూమినుంచీ ఎడంగా ఉంటున్నప్పుడు, ప్రచురణకు అవకాశం లేక దారిద్ర్యంతో బాధపడుతున్నప్పుడు, ఆత్మోన్నత్య కారకమైన కథా వస్తువును గ్రహించి దాని ద్వారా తన ఆశయాలనూ అపజయాలనూ వ్యక్తంచేస్తూ, స్త్రీని శక్తి స్వరూపిణిగా, అధికార గర్వావిష్టులైన రాజులకు గూడ గుణపాఠం నేర్పగలిగిన వ్యక్తిగా ప్రదర్శిస్తూ ఆయన కావ్య సృష్టిచేశాడు. 'పాంచాలీ శపథం', మహాభారతంలోని ఒక భయంకరమైన ఘట్టాన్ని ప్రత్యేకించి

నాటకీయం చేసిన రచన అందులో హృదయాన్ని దహించివేసే వివరాలు అన్నీ తు. చ తప్పకుండా ఉన్నాయి అట్లని ఈ కావ్యం, కవి కేవలం తన వ్యక్తిగత మైన అక్కసునూ, అణచిపెట్టుకొన్న చేదునీ, వెలి గ్రక్కిన సాధనం అనుకోరాదు. వ్యక్తిగతమైన కష్టాలను పరీక్షలను ఏకరువు పెట్టే తత్త్వం కాదు ఆయనది భారతి అంతకంటే ఉన్నతుడు. వ్యాసప్రోక్తమైన కథలోని సంఘటనలు, పాత్రలు, ఇక్కడ కవి మంత్రదండ స్పర్శతో రూపాంతరం చెందినవి; ఫలితం, భారతిచేసిన అనువాద సృష్టి, గాంభీర్యంలో గొప్పదనంలో, మూలకావ్యానికి ఏ మాత్రమూ తీసిపోదు.

ఈ కావ్య రచనకు అప్పట్లో ప్రేరణ కలిగించిన కారణం రాజకీయమే. పరాధీనతలో బందీయైన భారతమాత ఎన్నో అవమానాలకు, బాధలకు, గురి యౌతున్న సమయమది. ఆమె వీర పుత్రులు జైళ్ళలో మ్రగ్గుతూ చిత్ర హింస లకు గురియౌతున్న వేళ అది. పరాయి వారిచేత బందీయైన మాతృదేశ దృశ్యా నికి, కౌరవుల ఆస్థానంలో బందీయై దుశ్శాసనుని దుష్ట హస్తాలతో అవమానిత యైన ద్రౌపది, శక్తిమంతమైన ప్రతీకగా నిలిచింది

'పాంచాలీ శపథం'లో రాజకీయేతి వృత్తం ఒక్కటే ప్రధానం కాదు. అందులో లోకాంతర లోకాలుగా ఎన్నో పొరలున్నాయి. ద్రౌపది భరతమాత; ఆమె మూఢాచారాలలో బందీయైన భారత స్త్రీ కూడా; ఆలోచనా శూన్యుడై, స్వార్థపరుడైన పురుషుని దురన్యాయానికి గురియౌతున్న స్త్రీ మూర్తి కౌరవుల పేరోలగంలో నడిచిన మాటలు కర్ణ దుర్యోధనుల దౌష్ట్యాన్నీ, భీష్మ వికర్ణుల నిస్సహాయస్థితినీ, అవమానితయైన ద్రౌపది క్రోధాగ్నినీ ఒకవైపు వివరిస్తూనే, మరొకవైపు భారతదేశ సామాజిక జీవనంలో ఏర్పడిన దుర్గతినీ, దాని తాలూకు హైన్యాన్నీ కన్నుల గట్టేలా చేస్తున్నవి భీష్ముడు ధర్మ శాస్త్రాలను ఉల్లేఖిస్తూ చెప్పిన మాటలకు ద్రౌపది సమాధానం యొక్క శర పరంపర, నవ మహిళ ఎలుగెత్తి చేస్తున్న విమర్శ :

''అయ్యా, చక్కగా, గొప్పగా సెలవిచ్చారు మీరు-
మోసకారి రావణుడు సీతనపహరించి
వెళ్ళి ఉద్యానవనంలో ప్రతిష్ఠించి
మంత్రులనూ న్యాయశాస్త్రకారులనూ రావించి

తాను చేసిన ఘనకార్యం వివరించినప్పుడు
ఆ బుద్ధిమంతులేమన్నారు :

"నువ్వు చేసినది క్షేమైన పని!
ధర్మ సూత్రబద్ధమైన పని!" అన్నారు
దైత్యుడు రాజ్యపాలన చేస్తే మాత్రం
శాస్త్రాలు తప్పనిసరిగా గడ్డి తినాలా?
మీకు అక్కచెల్లెళ్లూ, భార్యలూ లేరా?
ఇది స్త్రీ మీద అత్యాచారం కాదా?
మీరు శాశ్వత నరకాన్నే కోరుకున్నారా?"

అయినప్పటికీ, రాజకీయ, సామాజిక భావాలనధిగమించి "పాంచాలీ శపథం" వస్తుతఃదైవ శక్తిని నిరూపించేదిగా ఉన్నది మానవుల కడగండ్లన్నింటికీ అంతిమ తరణోపాయం దైవ శక్తి ఒక్కటే ఉపరితల నిర్మాణాన్ని చక్కబరచుకోవాలంటే మొదట పునాదుల్ని గట్టిచేయాలి. విశ్వాసం వ్రేళ్ళని లోతులకు వెళ్ళి, ఒక మహత్తర శక్తిలో లంగరు వెయ్యబడ్డ నావలాగ నిశ్చలంగా నిలబడాలి అప్పుడే చెట్టుకి ఆకులూ పువ్వులూ పుష్కలంగా విస్తరిస్తాయి. కేవలం రాజకీయాధికారమూ, సామాజిక విముక్తి, భారత ప్రజలకు మేలు చేకూర్చవని భారతి భావించినట్లు మనకు తోస్తుంది. ఆధ్యాత్మిక శక్తి ఒక్కటే—క్షాత్రతేజం కాదు, బ్రహ్మతేజం - దుస్సాహసంతో కూడిన భయంకర హింసామార్గం కాదు, సాత్త్వికమూ దృఢమూ ఐన అహింసా పద్ధతి, దైవంలో కేంద్రీకృతమైనది - అది ఒక్కటే అన్ని దురాగతాలనూ జయించి, ధర్మాన్ని పునఃస్థాపించేందుకు, తగిన బలాన్ని చేకూర్చగలదు. అందువల్ల ద్రౌపది మనకు పాండవుల పట్టమహిషిగానే కాక అంతకంటే గొప్ప మూర్తిగా, ఆధునిక భారతీయ మహిళగా, భరతమాతగా కూడా గోచరిస్తున్నది ఆమె ఒక అవతార మూర్తిగా, అనంత సత్త్వమూలమైన మహాశక్తి అంశగా చిత్రింపబడింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగాని, సూర్యుడుగాని, సర్వహారియైన తమస్సుయొక్క ఆవృతిని ఎదుర్కొని నిలువలేక పోయినప్పుడు, దేవియైన దుర్గ మాత్రమే ఆ తమస్సును నివారించగలదు. ఆంతరికమైన ఆ తమస్సు - మనలోని అజ్ఞానం; మన హృదయాల్లోని కల్మషం; అదే మహిషాసుర దుష్టశక్తి; మనల్ని

బానిసత్వంలో బందీలు చేసేదీ అదే! నమ్మశక్యంకాని దురాగతాన్ని తలపెట్టిన దుశ్శాసనుడు ద్రౌపదిమీద చేయివేసి నప్పుడు, ఆ ముహూర్తంలో-

"ఉమా సుందరి, భద్రకాళి,
మూలశక్తి, ధనుర్ధారిణి,
మహామాయ, మాయాహారిణి,
సింహమెక్కి చిరునవ్వుతో బ్రోచే తల్లి,"

ద్రౌపది ప్రజల్వించే హృదయ కుహరంలో సాక్షాత్కరిస్తుంది. రాజమహిషి ద్రౌపది అంతస్సులోకి దివ్యమైన మూలశక్తి అలా ప్రవహించడంతో, ఆమె విజేతగా వెలుగొందుతుంది దైవ నిర్ణీతమైన అద్భుతం జరుగుతుంది. ఇది కేవలం నాటక పద్ధతిలో చౌకబారు ప్రక్రియగా జరిగే ఆకస్మికమైన తారుమారుకాదు. ఇది ఆత్మ యొక్క సంపూర్ణ సత్తనూ సర్వాధిక్యాన్నీ నిరూపించడమే. కావ్యం పాంచాలి కఠోర శపథంతో మన చెవులు మారుమ్రోగుతుండగా ముగుస్తుంది:

"పరాశక్తి సాక్షిగ నేనీ శపథం చేస్తున్నాను:
దురాత్ముడైన దుస్ససేనుని అరుణారుణ రక్తం,
దుర్యోధన దైత్యుని రక్తం, కలిసి కాల్వలు కట్టేదాక,
నా వీడిన వేణీ బంధం ఆ రక్తంలో తడిపేదాక,
అప్పుడు నేను స్నాతనై, అంటిన మాలిన్యం కడిగేదాక-
అప్పటిదాక, సవరించను!
నేనీ వీడిన చెదరిన కురులను ముడువను!"

# అధ్యాయం 7.

## కోయిల పాటలు

భారతి కవితల్లో అత్యంతం ఆకర్షించేదీ, అర్థ క్లిష్టత కలిగినదీ – "కుయిల్ పాట్టు". చక్కని తేట తమిళంలో రచింపబడిన ఈ కావ్యం, చిన్న పిల్లల కథల పుస్తకంలోని ఒకానొక ఊహా కల్పనగా మనకు కనిపిస్తుంది ఇది 75 పాదాలు కలిగిన కథా కావ్యం ఇందులో పశుపక్ష్యాదులు పాత్రలు, కోయిల నాయిక. బహుశా ఇది ఒక స్వప్న చిత్రణమే కావచ్చు, కోలెరిడ్జ్ కవి "కుబ్లఖాన్" కవితవలె కావ్య ప్రారంభం ఇలా వుంది :

"కవితా రసావేశంలో వాస్తవం మరుగునపడి,
మండు టెండల్లో మతి పోయిన ఒక రోజు,
కవి కన్నపగటి కలలో – ఇలా కనిపించింది."

ఈ కావ్యంలో అడుగడుగునా సున్నితమైన హాస్యమూ, అబ్బురమైన భావుకతా నిండి వున్నాయి కవి ఒక కోయిల చేత ఆకర్షితుడౌతాడు దాని గాన మాధుర్యానికి వలపులో పడతాడు ఒక మానవుడు ఒక పక్షిని వలచి వాపోవడం హేతుబద్ధమైన సంగతి కాదు. ఊహకు విరుద్ధం కథ నడిచే కొద్దీ, అంతకంటే ఆశ్చర్యం కలిగించే విషయాలు ఎదురౌతాయి. కోయిల చేసే వలపు చేష్టల్నీ మొదట ఒక కోతితో, తర్వాత ఒక ఎద్దుతో అది కులకడాన్నీ, కవి గమనిస్తాడు. అలా భంగపాటుతో ఆవేశం చెందిన కవిని ఆ కోయిల శాంత పరుస్తుంది. తన పూర్వ జన్మ వృత్తాంతాన్ని చెబుతుంది. తాను గడిచిన జన్మలో ఒక అరణ్య రాజకుమారిననీ, ఆటవికులైన మదనుడూ కురంగుడూ, అంటే ఆ ఎద్దూ కోతీ, తన్ను అప్పుడు ప్రేమించారనీ, తాను మాత్రం 'వంచీ' రాజకుమారుణ్ణి వలచి వలపించుకొన్నదనీ, కోయిల చెబుతుంది. ఆ జన్మ విషాదాంతమైందనీ, ఇప్పుడు కోయిల తన రాజకుమారుడు ఈ కవి రూపంలో లభించాడనీ చెబుతుంది కవియొక్క ప్రేమపూరితమైన స్పర్శతో ఆ పక్షి సౌందర్యవతియైన కన్యగా మారిపోతుంది ;

"ఆ తియ్యందనాల అపురూప సౌందర్యరాశి,
హృదయ సమ్మోహనంగా ఎదుట నిలుచున్నది!
కోవిదులకూ జ్ఞానులకూ నేనేమని వర్ణింపగలను
కవితారసాన్నీ రచనా శిల్ప తత్త్వాన్నీ
అమృతంతో మేళవించి, వలపుతో ముద్ద చేసి,
బ్రహ్మ రూపకల్పన చేసిఉండాలి ఈ అప్సరను,"

సుందరిని కవి కౌగలించుకో బోగా, అతడు దబ్బున వాస్తవంలోకి త్రోసి వేయబడ్డాడు :

"కళ్లు తెరిచి, తేరుకొని, చుట్టూ చూశాను
వ్రాతప్రతులు, కలాలు, పత్రికల కట్టలు,
నా చింకి చాప–నా యింట్లోనే ఉన్నానని తెలిసింది నాకు.
వనము, కోయిల, వలపు, అన్నీకూడా,
ఆ కట్టు కథ సర్వమూ, నా భావన,
ఒక అందమైన సాయంత్రం నుంచీ
అల్లిక చేసిన జిగిబిగి ఊహా చిత్రం."

కాని కళ్ళల్లో ఒక కొంటె మెరుపుతో, కవి ఈ క్రింది పంక్తులను కూడా చివర ఉటంకిస్తాడు :

"కట్టు కథే కావచ్చు, కవిసత్తములారా,
పరిశీలనతో చదివితే తోచదా
గంభీరమైన తాత్త్వికార్థం?
అదేమిటో కాస్త సెలవిస్తారా?"

కవి చేసిన ఈ సవాలుని గ్రహించి అనేకములైన వ్యాఖ్యాన పరంపరలు బైలు దేరాయి నిజానికి భారతి కేవలం ఊహాగాధను అల్లుతూ కాలక్షేపం చేసే రకం కవి కానే కాదు; అందులో పాండిచ్చేరిలో కలిగిన అనుభవాలతో తీవ్ర మన స్థితిలో ఉన్న చివరి రోజుల్లో ఆయన అలా చేసి ఉండడనడం స్పష్టమే, అందు వల్ల, పి. యం. సుందరం, కె. పి. రాజగోపాలన్, టి. పి. మీనాక్షి సుందరం

వంటి రచయితలు కావ్యానికి చేసిన వ్యాఖ్యలు సత్య బద్ధమేనని అనుకోవాలి బహుశా ఈ కావ్యం, మనిషియొక్క రసచేతన సౌందర్యాన్వేషణలో పొందే పరిణామాల్ని గూర్చి కావచ్చు. అది సులువుగా అందే ఇతివృత్తం కాదు సౌందర్యం ప్రచ్ఛన్నమై సర్వత్రా ఉన్నది. కాని దానికి రూపాన్నీ, జీవాన్నీ ఇవ్వడానికి ఒక 'పిగ్మాలియన్' అవసరం. సౌందర్యం పక్షియై తనని ఆ శాపంనుంచి విముక్తి కలిగించేందుకు విధి నిర్ణయించిన రాజకుమారుడి కోసం వేచి ఉంటున్నది భూమి నుంచీ, ఆకాశం నుంచీ, శిలనుంచీ నీటినుంచీ. వెలుగునుంచీ చీకటి నుంచీ, కాకీ నుంచీ కోయిలనుంచీ. సౌందర్యాన్ని సృష్టించగల రహస్యం - ప్రేమ, ప్రేమ, అన్నింటా ఆ ప్రేమ ఒక్కటే భారతికి తెలిసిన సంజీవని ప్రేమ! అది ఒక్కటే అన్నిచోట్లా, అన్ని వస్తువులనుండీ సత్యం శివం-సుందరం ఐన ఆత్మను గ్రహించగలదు ప్రేమ మంత్రమే ఆయన రచనలన్నింటిలోనూ అంతర్వాహినియై ఉన్నది, "ప్రేమ సందేశం" అనే ఈ గీతంలో ఆ భావం మరపురాని విధంగా అభివ్యక్తమైనది :

"ఈ విశాల ప్రపంచంలో
ఎన్నో రకాల చెట్లు,
తావులు విరజిమ్మే వయ్యారి మొక్కలు,
పచ్చని గడ్డి, అపురూపమైన మూలికలు-
ఇవన్నీ ఎలా బ్రతుకుతున్నయ్ ?
మనిషి దున్ని, విత్తక పోయినా
నీళ్లుపోసి పెంచక పోయినా
నింగినుంచీ కురిసే వానలే
చెట్లను, పంటను, గడ్డినీ పోషిస్తాయి.
మీ కెందుకు భయం, జీవులారా! నాతోరండి,
ఎప్పుడూ శ్రమించడమేనా పని!
ప్రకృతిని నమ్మితే ఆమె అన్నం పెడుతుంది,
ప్రేమ ఒక్కటే మీకిక్కడ విధాయకం."

## అధ్యాయం 8.

# బహుముఖ సాహిత్య సృష్టి

భారతికి గీత రచన ఆజన్మ సిద్ధమైన ప్రతిభ. చెట్టు చిగురించినంత సహజంగా ఆయన పాటలు కట్టేవాడు. ఎన్నో అవరోధాలు, ఇతర వ్యాసంగాలూ ఉండేవి బాహ్య జీవితం రాజకీయాలకు అంకితమైనా, ఆయన అంతరంగంలో పరమార్థాన్ని గూర్చిన అన్వేషణ ఎప్పుడూ సాగేది దైవాన్ని చేరుకునే పరమ రహస్యం కోసం ప్రయత్నం జరిగేది దానితోపాటు శిధిలమైన హైందవ సామాజిక వ్యవస్థను సంస్కరించవలసిన అవసరం ఎంతో ఉన్నదనీ ఆయనకు ఎరుకే. సామాజికమైన మార్పు, సమాజోద్ధరణ, వీటికి సంబంధించిన సమస్యలను గూర్చి ఎంతో ఆలోచించి, పత్రికా రచనల ద్వారా అభిప్రాయాల్ని వ్యక్తం చేశాడు ఆయన ఒక 'సంస్కరణల సంఘం'లో సభ్యుడై వర్ణాంతర పంక్తి భోజనాలలో పాల్గొన్నాడు. సి. రఘునాథరావు సంపాదకత్వంలో వెలువడే "రాడికల్ సోషల్ రిఫామ్" పత్రికలో ఆయన రచనలు ప్రకటితమయ్యాయి సంఘ సంస్కరణను గూర్చిన ఈ ఉత్సుకత భారతి జీవితాంతమూ ఆయన్ని విడిచిపెట్టలేదు ఒకసారి అస్పృశ్య బాలకుడొకణ్ణి బ్రాహ్మణుణ్ణిచేసి జంధ్యం ధరింపజేసే సుదీర్ఘమైన తంతు కూడా ఆయన జరిపించాడు. భారతి వ్రాసిన "మ్రోగించు గంట" పద్యంలో స్త్రీల పరాధీనతనూ, సవర్ణుల దురహంకారాన్నీ అంతం చెయ్యాలన్న పిలుపు ఉన్నది. స్త్రీలు పురుషులకు భాగస్వామినులేగాని, బానిసలు కారు :

"రెండు కళ్ళలో ఒక దాన్ని పొడిచి
అంధత్వాన్ని ఆహ్వానిస్తారా ?
మహిళా విజ్ఞానాన్ని పెంచి
వదిలించండి లోకం అజ్ఞానాన్ని."

అగ్నిని ఆరాధించే బ్రాహ్మణుడు, మెక్కావైపు తిరిగి ప్రార్థనలుచేసే ముసల్మాన్, శిలువకు ప్రణామం ఆచరించే క్రైస్తవుడు, భగవంతుని సర్వ వ్యాపకత్వాన్ని ధ్రువీకరిస్తున్నారు. ఐనప్పుడు, మతానికి మతానికి మధ్య ఈ అర్థంలేని భేద

మేమిటి? అస్పృశ్యత విషయం తీసుకుంటే, అది ప్రకృతి అనుశాసనానికి పూర్తిగా విరుద్ధం. పిల్లి గంపెడు పిల్లల్ని పెడితే, అందులో ఒక్కొక్కటీ రంగుల భేదంతో ఉంటే మాత్రం, అవి అన్నీ ఆ తల్లి పిల్లలు కావా?

"ప్రమోగించు గంట, చాటించుదామింక
ప్రేమకు మించిన దేదీ లేదు!
అడ్డుగోడల్ని పడగొడితే
అంతమౌతాయి బాధలన్నీ!"

తమిళదేశంలోని స్త్రీలు భారతి కెంతో ఋణపడివున్నారు స్త్రీలకు సమాన ప్రతిపత్తి యివ్వవలెననే నినాదాన్ని గొంతెత్తి పలికిన వారిలో ఆయన ప్రథముడు బాల్య వివాహాల ద్వారానూ, వితంతువులపట్ల నిర్దాక్షిణ్యంతో చేసే దురన్యాయాల ద్వారానూ, పీడితులౌతున్న స్త్రీజాతి విముక్తిని కోరాడాయన స్త్రీ అంటే "మాతృత్వపు ఖ్యాతీ, భార్యాత్వపు పేరూ సంగమించిన పవిత్రమూర్తి" కాదా? భారతి దృష్టిలో "నవమహిళ" విద్యావంసురాలిగా, ఉద్యోగినిగా, ప్రపంచ ప్రయాణీకురాలిగా, భారతదేశ గౌరవాన్ని పెంపొందింపజేసే సాంకేతికవేత్తగా తయారవాలి. ఇంటి మారుమూలల్లో బందీయై ఉండడంపోయి, ఈ 'నవమహిళ' తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకొన్నప్పుడు, ఆమెను—

"జీవ సంరక్షిణీ, సృష్టికర్త్రి,
ప్రాణంలో ప్రాణమైన అమృతమయీ"

అంటూ అందరూ ప్రస్తుతిస్తారు.

భారతియొక్క సామాజిక స్పృహ, తమిళుల అభ్యున్నతికైన ప్రగాఢ వాంఛ, వారి స్వార్థపరత్వాన్నీ, చిరకాల స్తబ్ధతనూ హేతుబద్ధమైన విశ్లేషణచేసి, వారి గుణదోషాల్ని ఆయన విమర్శించేలా చేసింది. అపారమైన జ్ఞానం ఒకవైపు వుండగా, కొండ చిలువలాంటి ఈ అజ్ఞానమేమిటి? మనుష్యులు ఎందుకని పరామర్శ చెయ్యరు? ఆలోచించి, అన్వేషించి. తమ జీవితాల్ని వెలుగుబాటగా చేసే జ్ఞానాన్ని సంపాదించరు?

"కాంతి వెల్లువలై
వాహినిగా ప్రవహించి

కాంతి సముద్రమై, వెలుగుల ఝంఝయై,
జ్యోతిర్మయీ దేవి
లోక పరివ్యాప్త అయితేనేం,
ఒక్క హృదయమే కాకియై,
ఈర్ష్యాతమస్సు గూడుకట్టి
స్పందిస్తుందే. ఎంత సిగ్గు!''

ప్రాచీన కాలంలో ఋషులు మానవ హృదయాన్ని, వెలుగుతో నింపడమెలాగో ఆ రహస్యాన్ని గ్రహించినట్లు తోస్తుంది ఓం అనే మంత్రాన్నీ, దాని ధ్వని తరంగాలనూ అందుకోసం వాళ్ళు ఉపయోగించారు. ఆధునిక చేతనని కూడా అలాగే ఒక మంత్ర శబ్దం ద్వారా జ్ఞాన కాంతి ప్లావితం అయ్యేలా మార్చడానికి వీలవుతుందా ? "సత్యాన్ని ప్రకాశింప జేద్దాం, హృదయంలో అగ్ని ప్రజ్వ లిస్తుంది," అంటాడు భారతి. మానవ మస్తిష్కాన్ని ఒక మెరిసే బంగారు సాధనంగా, సృజనాత్మకమైన మంచి తనాన్ని పెంపొందించడానికి అనువుగా, మార్చమని దివ్యశక్తుల్ని అర్థిస్తాడు "శక్తి" అనే పదాన్ని వల్లించమంటాడు. అమృతభాండాన్ని అందుకోమంటాడు "శబ్దం" అనే భారతి గీతం, కవి హృదయపు లోతుల్లో నుంచీ వెలువడిన తదాళయ ధ్యానం

పార్థివమైన ప్రకృతిని పరివర్తనం చెందిస్తూ, ఆ అనుక్రమంలో మృత్యువు సరిహద్దుల్ని అధిగమించాలనే కోరిక, అయన వ్రాసిన ఆత్మకథా ప్రధానమైన రెండు రచనల్లో మనకు స్పష్టంగా గోచరిస్తుంది అవి, "స్వప్నం", "భారతి అరవై ఆరు" అనేవి. భారతి స్నేహితుల్లో సిద్ధులైన వారిని గూర్చిన పరిచయం అందులో ఎక్కువ ఆసక్తికరంగా ఉన్నది. భారతికూడా ఒక సిద్ధుడే. మృత్యు వును జయించే ప్రయత్నంచేస్తూ, ఆ ప్రయత్నంలో విజయం పొందాడనే చెప్పు కోవాలి తమిళ దేశంలో తనకు పూర్వులైన కవులవలెనే ఆయన కవిగా అమర త్వాన్ని పొందగలిగాడు. దృఢమైన ఆశా భావమూ, ఆత్మయొక్క అనశ్వరత్వంలో అచంచల విశ్వాసమూ, మనకు కూడా అమరత్వాన్ని ప్రసాదించగలవు:

''గతం మళ్ళీరాదు, మూర్ఖులారా!
దుఃఖంలో మునిగి పోతారెందుకు,

గత స్మృతులచే సర్ప దష్టులై?
గతాన్ని పలకరించవద్దు
విశ్వాసం పెంచుకోండి
'మనం ఇవ్వేళ మళ్ళీ పుట్టాం!'
లోకంతో క్రీడిస్తూ ఆనందంలో జీవిద్దాం.
మీరు నా మాట వినకపోతే ఎట్లా?
మీ మూర్ఖత్వాన్ని మళ్ళీ చూపితే ఏం ప్రయోజనం?''

భారతి వచన కవితలు వాటికవే ప్రత్యేకమైనవి రవీంద్రనాధ టాగూర్ నోబెల్ బహుమతి పొందినప్పుడు భారతి టాగూర్ కవితల్ని తమిళంలోకి అనువదించాడు. ఉదాహరణకు జాతీయ విద్యను గూర్చిన కవిత, కథలలో కొన్ని, "ది క్రెసెంట్ మూన్''లోని ఖండికలూ అనతికాలంలోనే టాగూర్ శైలి భారతిని ప్రభావితుణ్ణి చేసింది ఆయన కప్పటికే విట్‌మన్ రచనలు తెలుసు, ఇప్పుడు ''గీతాంజలి'' చదివాడు ఆ వచన కవిత్వ ధోరణిని భారతి గ్రహించాడు కాని తీసుకున్న ఇతివృత్తం వేరు భారతి సాహసించి వేదాల దాకా వెనక్కిపరుగులు తీశాడు. ప్రాచీన ఋక్కులవలె రసావేశంతో నిండి భారతి వచన కవితలు ఆనంద మాధుర్యాలతో పరవళ్ళు తొక్కుతవి వేద కర్మలలో ''మధు విద్య''ను జ్ఞాపకం తెస్తవి. మనల్ని పరివేష్టించి ఉన్న ప్రకృతి సౌందర్య రేఖలు భారతిని కవ్వించు, ధారాపాతమైన సంగీతాన్ని పలికించినవి అది రసావేశంతో చేసిన నృత్యం; చేతన యొక్క విశాల భూముల్లో శక్తితో నిండిన శబ్దాల ఉల్కాపాతం; అక్కడ దైవ - మానవ సంయోగం అద్వైత స్థితిని పొందుతున్నది.

''అగ్ని జ్వలింపనీ—
ధర్మాగ్ని, జ్ఞానాగ్ని,
ప్రాణాగ్ని, తపోగ్ని,
యజ్ఞాగ్ని,
కోపాగ్ని, విరోధాగ్ని,
అనాచారాగ్ని—

అన్నీ ఆర్పిస్తాం.
అన్నీ రక్షిస్తాం.
అన్నీ శాసిస్తాం.
ఓ అగ్నీ. నువ్వు జీవన సహచరివి.
నీకు మా ప్రస్తుతి.''

ఈ వచన కవితలు, భారతి పాండిచ్చేరిలో గడిపిన రోజుల్లో, ఆయన్ని వేధించిన ప్రతికూల పరిస్థితులను తిరస్కరిస్తూ వ్రాసినవి. ఇవి ఆరు గుచ్ఛాలుగా ఉన్నవి- ''దృశ్యం'', ''శక్తి'', ''పవనం''; ''సాగరం'', ''పృధివీ దృశ్యం, ''స్వేచ్ఛ'' ''దృశ్యం'' ప్రకృతిలోని అనంతమైన వైవిధ్యాన్ని చూచి భారతి పొందిన ఆనందాశ్చర్యాలను వ్యక్తం చేస్తుంది ''శక్తి'' ఆ అద్భుత దృశ్యం వెనుక సూత్రధారిణియైన శక్తిని అన్వేషిస్తుంది. ''పవనం'', ''సాగరం'' లో చుట్టూవున్న జీవితం తాలూకు వాస్తవిక వర్ణనలూ, పాండిచ్చేరి సముద్ర తీరంలో సాగరాన్ని చూస్తూ సముద్రపు గాలిని ఉచ్ఛ్వసిస్తూ ఆయన గడిపిన క్షణాల అనుభూతీ ఉన్నాయి. ''పృధివీ దృశ్యం'', ''స్వేచ్ఛ'' రచనల్లో మానవుని పతనానికి కారణాలను వివరించే ప్రయత్నం కనిపిస్తుంది - మానవుడు అసత్యంలో బ్రతుకుతూ, తోటి మానవునితో స్పర్థిస్తూ పోరాడుతూ, అజ్ఞానంతో కప్పబడి ఉండడమే అతని అధోగతికి హేతువు, దేవతల సభలో ఇంద్రుడిలా అంటాడు :

''యుగాలకు పూర్వం, మబ్బువంటి దుష్ట శక్తి
మానవుని కోసం మనం ఏర్పరచిన
సర్వ శుభాలనూ హరించింది.
'దేవతలు నిర్వీర్యులు, దైత్యులు బలశాలురు,
ధర్మం నిష్ప్రయోజనం, అధర్మం గట్టిది,
సత్యం పనికిమాలినది, అసత్యం నిండైనది,
సంతోషం నశిస్తుంది, దుఃఖం దాన్ని జయిస్తుంది'.

పృథివిపై పాపం ఇలా పుట్టింది.
మానవజాతి కలవరపడింది,
విశ్వామిత్ర, వశిష్ఠ, కశ్యపాది దివ్యఋషుల
మహోత్తర వాణి అంతరించింది.
కుహానా మతాల ప్రబోధం విజృంభించి
మనిషి గంగను కోరితే, మృగతృష్ణ లభించింది.''

ఈ వచన కవితలు చివర ఆశాభావంతోటే ముగుస్తాయి. నిరాశాపూరితమైన ఆ సన్నివేశంలో, వసుపతి అనే ఆధునిక యువకునికి, వాయుదేవుడు దీర్ఘాయువును, ఇంద్రుడు మేధాశక్తిని, సూర్యుడు జ్ఞానజ్యోతిని ప్రసాదించడంతో వారందరి ఆశీస్సులను పొందిన ఆ యువకుడు భారత జాతి పునరుజ్జీవన తపశ్చర్యకు సంసిద్ధుడౌతాడు అప్పుడు వసుపతి వేదపురీ సముద్రతీరాన నిలబడి భవితవ్యాన్ని గూర్చి యిలా గానం చేస్తాడు - ఇది భారతి పాండిచ్చేరీ సముద్రతీరాన స్వయంగా పాడిన స్వీయ చరిత్రాత్మక సన్నివేశమే తప్ప మరొకటి కాదు:

''భయాసురుని గెలువ
నడచి వచ్చిన సైన్యమా,
కళా మధువు సేవింప
పొంగి వచ్చిన ఆనందమా,
రా, వెన్నెలా, రా!''

## అధ్యాయం 9.

# భారతి వచన కథా సాహిత్యం

భారతి ప్రధానంగా కవిగానే ప్రసిద్ధుడై నప్పటికీ, ఆయన ఆధునిక తమిళ వచన నిర్మాత కూడా అని చెప్పాలి ఆయన చేతిలో భాష, ఉక్కువలె గట్టిదిగా, గాజువలె పారదర్శకమైనదిగా మార్పు చెంది ప్రతి భావచ్ఛాయను సవ్యంగా వ్యక్తం చెయగల శక్తిని సమకూర్చుకొన్నది సముజ్జ్వలమైన ఆయన పత్రికా రచనలు రాజకీయాలను ఇంటింటా ప్రతిరోజు చర్చింపబడే విషయంగా మార్చినవి ఇంగ్లీషు చదువుకొన్న మేధావివర్గాల ఆలోచనారీతుల్ని మారుమూలల్లోవున్న తమిళ పాఠకులకు పరిచయం చేసినవి అనువాదాలు, వ్యాసాలు, కథలు, నివేదికలు, సాహిత్యపరమైన తేలిక రచనలు - ఆయన మహత్తర లేఖినినుంచీ ధారాపాతంగా వెలువడిన వెన్నో! ఆ రచనల్లో చాల భాగం, రకరకాలైన మారుపేర్లతో వ్రాసి నందువల్ల ఆయనవిగా గుర్తించడం కష్టమైనప్పటికీ, ఆర్ ఎ పద్మనాభన్, పెరియ స్వామి తూరన్, సి. విశ్వనాథ అయ్యర్‌వంటి భారతి అభిమానుల నిర్విరామ కృషి వల్ల భారతి వచన రచనల సముదాయము నేడు వెలుగులోకి తేబడి, గొప్ప నిధా నమై వున్నది.

భారతి వచనంలో నిరంతర కాంతి ప్రభను విరజిమ్ముతున్న అగ్ని :- అకలంకమైన దేశాభిమానమూ, ప్రజ్వలించే సంఘ సంస్కరణదీక్షా ఆయన దేశాభిమాన రచనల్లో ఆనాటి సమకాలీనత ప్రతి ఫలించినప్పటికీ, సంఘ సంస్క రణ రచనల్లో అంతకు మించిన సందర్భ శుద్ధి, అంటే ఈ నాటికి అన్వయించే గుణం, కనిపిస్తున్నది. ఇదివరకే పేర్కొన్నట్లు, ఆయన ముఖ్యంగా రెండు దురా చారాలను ఖండించాడు: స్త్రీలను తక్కువ చూపు చూచి కష్టపెట్టడం; అస్పృశ్యు లకు జరిగే దురన్యాయం తాను ప్రబోధించే మాటల్ని తన ఇంటిలోనే ఆచర ణలో ప్రవేశపెట్టే ధైర్యమూ, నిజాయితీ అయన కుండినవి స్త్రీలకు సమాన ప్రతి పత్తి కల్పించమని పురుషుల్ని ఉద్దేశించి ప్రబోధించాడు విద్యావతులై చక్కని జీవనం సాగించాలని ఆశిస్తున్న స్త్రీలను ప్రోత్సహించమని అభ్యర్థించాడు. మన

ఇళ్ళల్లోనే స్త్రీలు గాలి వెలుతురూ లేని, తడియారని పంజరాల్లో బందీలుగా మగ్గుతూ వుంటే, 'శక్తి పూజ' లు, మన దేశం 'జగన్మాత' అనీ గొప్పలు చెప్పి ఏమి ప్రయోజనం? మగవాళ్ళు ఒకవైపు వ్యభిచారానికి ఆకర్షితులౌతూ, మరొకవైపు స్త్రీ పవిత్రతను గురించి గట్టిగా ఆదేశిస్తూ వుండడం ఎంత అసంబద్ధంగా వున్నది! భారతి దృష్టిలో దేశ సంస్కృతిని కాపాడగలిగిన దక్షత స్త్రీలకే వున్నది, అది వారికే దక్కాలి. స్త్రీలను విద్యావతులను చేయడమే కాదు, బాల్యవివాహాల దురాచారాన్ని ముఖ్యంగా అంతం చెయ్యాలని ఆయన ప్రబోధించాడు ఆ దురాచారంవల్లనే చాలమంది ఇళ్ళల్లో దుఃఖ భాజనులైన వితంతువులు వుండడం సంభవించేది. ఈ విషయమై గట్టిగా వాదిస్తూ వ్రాయడమేకాదు ఆయన 'చంద్రికాయిన్ కధై' అనే నవలకూడా ఆ ఇతివృత్తంతో వ్రాశాడు

కాని చంద్రికై కధ ఆయన పూర్తిచేయలేకపోయాడు. ఈ అసంపూర్తి నవల, భారతికి ఈ ప్రక్రియలోగల ప్రతిభా విశేషాల్నిగూర్చి మనం అభిప్రాయం ఏర్పరచుకోడానికి చాలినంత లభించే వున్నది గొప్ప వాస్తవికతా రచయిత లక్షణాలు ఆయన కున్నాయని చెప్పాలి లభించిన తొమ్మిది అధ్యాయాలూ, ఆయన కధన శిల్పానికి గల జవసత్వాలకు తార్కాణగా నిలుస్తున్నవి నవల 1901 లో ఒక మారుమూల తమిళ గ్రామంలో సంభవించిన భూకంపంతో, అందులోంచి బ్రతికి బైటపడ్డ ఒక వితంతువూ ఆమె మేనకోడలు చంద్రిక పాత్రలుగా, ప్రారంభమౌతుంది. ఆ వితంతువు జీవనోపాధికోసం మూడేళ్ళు అగచాట్లు పడుతుంది. ఆమె జి. సుబ్రహ్మణ్య అయ్యర్, వీరేశలింగం పంతులు (ఇద్దరూ చారిత్రక పురుషులే) వంటి సంఘ సంస్కర్తల సాహాయ్యాన్ని అర్థించి, చివరకు విశ్వనాధశర్మ అనే వ్యక్తిని వివాహం చేసుకుంటుంది అతను పూర్వాశ్రమంలో సన్యాసి. వాళ్ళిద్దరూ సుఖంగా దాంపత్య జీవితం గడుపుతూ, చంద్రికను తమ సొంతబిడ్డలాగా చూచుకుంటుండగా, శర్మకు మతిచలిస్తుంది అక్కడితో కథ నిలిచిపోయింది.

నవలలో ప్రధానమైన భాగం చంద్రికను ఆధునిక ఆదర్శ బాలికగా రూపురేఖలు తీర్చిదిద్దేందుకు ఉద్దేశింపబడినట్లు తోస్తుంది కాని మనకు మిగిలినది: కేవలం ఒక వితంతువుయొక్క పునర్వివాహమూ, ఆ వివాహానికి ముందు జరిగిన వాస్తవిక సంఘటనలూ, వాటితోపాటు యధార్థ జీవితంలో సంస్కర్తలుగా ప్రసిద్ధులైన అయ్యర్, పంతులూ పాత్రలుగా ప్రవేశ పెట్టడమూ. అందులో భారతి వేసిన ప్రశ్న: "సాంసారిక జీవితమా? సన్యాసమా?" అనేది ఒక విశేషం. ఈ విచి

కిత్సకు ఆయన్ని ప్రేరేపించిన కారణం - తాను స్వయంగా కుటుంబాన్ని పోషించే ప్రయత్నంలో ఎదుర్కొన్న కష్టాలు కావచ్చును; శ్రీ అరవిందులవంటి సిద్ధి పొందిన ఒక గొప్ప యోగి చేరువలోనే ఉండడం కావచ్చును సన్యాసం, కాషాయ వస్త్రధారణంవంటి బాహ్య ప్రక్రియలమీదే ఆధారపడితే, వ్యక్తిలో అణచ బడిన కోరికలు ఆకస్మికంగా చెలరేగినప్పుడు, వ్యక్తి మనశ్చాంచల్యానికి గురి కావచ్చును నిత్యానందుడు తన సన్యాసి వస్త్రాలను విడనాడి, విశ్వనాథశర్మ పేరుతో విశాలాక్షిని వివాహం చేసుకొన్నప్పుడే అతనికి జీవితంలో ఆనందమూ ఆత్మశాంతి లభించినవి!

చంద్రికను గురించి మూడేళ్ళ బాలికగా ఒక చిన్న వర్ణన మాత్రమే ఉన్నది :

"ఆమె నవ్వు గులాబీల చిరునవ్వు కరచరణాలు పసిడి మోము వెన్నెల. కంఠస్వరము గంధర్వుల స్వర్ణ వీణా నాదము. కదలికలు అప్సరల నృత్య విలాస భంగిమలు."

భారతికి ఎక్కువగా చిన్న కథలు వ్రాసేందుకు తగిన తీరికగానీ, ప్రశాంతి గానీ ఉండేదికాదు కానీ వ్రాసిన కొన్నింటిలోనూ ఒక తీవ్రమైన దీక్ష కనిపిస్తు న్నది "స్వర్ణ కుమారి" అందుకు ఒక చక్కని ఉదాహరణ. ఛాందసుడైన మనోరంజన్, స్వర్ణ కుమారి అనే బ్రహ్మ సమాజానికి చెందిన యువతిని ప్రేమి స్తాడు ఆ అమ్మాయి తండ్రి ఆమెను మరొక బ్రహ్మ సమాజ మతస్థుడైన హేమ చందర్‌కు ఇవ్వాలనుకుంటాడు హిందువులను మూఢాచారాలనుంచీ విముక్తుల్ని చేయాలని బ్రహ్మ సమాజం చక్కని సంస్కరణలను ప్రవేశపెట్టిన మాట నిజమే. కాని కొందరు బ్రహ్మ సామాజికులు అంతటితో ఆగక, పాశ్చాత్యుల దురభ్యాసా లను సైతం అనుకరించారు. హేమచందర్ జంకులేకుండా మాంసాహారాన్నీ మద్యపానాన్నీ అలవరచుకున్నాడు. స్వర్ణ కుమారి అతన్ని కాదనడంలో ఆశ్చర్య మేమీలేదు మనోరంజన్, స్వర్ణ, ఇద్దరూ ఏకం అయ్యే ముహూర్తం సమీపించి నప్పుడు, మనోరంజన్ దైవ సమానుడైన తిలక్ రాజకీయ సిద్ధాంతాలను వ్యతిరే కించినట్లు ఆమెకు తెలుస్తుంది తెలియగానే దేశాభిమానిగా తప్పుదారిపట్టినాడని అతణ్ణి ఆమె నిష్కర్షగా తిరస్కరిస్తుంది

సంభాషణ ప్రధానమైన రచనలు కూడా కొన్ని ఉన్నాయి భారతికి ఒక నంబూద్రి బ్రాహ్మణునికి జరిగిన సంభాషణ అందులో ఒకటి. కేరళలో నడచిన

సంఘ సంస్కరణోద్యమం (ఎస్. ఎస్. డి. పి యోగం) యొక్క పూర్తి స్వరూపాన్ని గూర్చి వివరంగా ఈ సంభాషణ తెలియజేస్తుంది కేవలం చిత్రమైన ఊహలే ప్రధానంగాగల కథలు, "చంద్రదీవు" వంటివీ, ఉన్నాయి ఏ వంకతోనైనా సరే భారతి తనకు నచ్చిన సిద్ధాంతాన్ని ప్రబోధం చేయడానికే అన్నింటా ప్రయత్నిస్తాడు. ఆయన చేసే వర్ణనల్లో తరచు హేళనాత్మక విమర్శ మిళితమై ఉండి, మన చుట్టూ ఉన్న మనుష్యులే, వారికి సహజమైన లోపాలతో, మూర్తి కట్టి స్పష్టంగా కనిపిస్తారు "ఆరోవంతు" అనేది కొంత పెద్ద కథ; వర్ణ సమానత్వాన్ని ప్రబోధిస్తూ, జాతి పునరుజ్జీవనానికి బ్రహ్మచర్యమే కీలకమైన సాధనమని చెబుతుంది. ఇందులోని నాయకుడు గోవిందరాజన్ బ్రహ్మసామాజికుడనీ, వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నాడనీ, అతడు ప్రేమించిన కన్య తండ్రి అతణ్ణి తిరస్కరిస్తాడు. ఈ కథా నాయకుడు చేసిన దేశయాత్రలో విశాల భారత దేశ దృశ్యాలు వర్ణింపబడినవి. అవి గర్వంతో ప్రేమతో భారతి తన కళ్లతో దర్శించిన దృశ్యాలే "ఆరోవంతు" కథలోనే దేశంలోని అస్పృశ్య ప్రజానీకం ప్రసక్తి కూడా ఉన్నది కథా నాయిక ఈ అభాగ్య భారత పుత్రుల కష్టాల్ని తీర్చే దీక్షతో సేవానిమగ్నురాలై ఉంటుంది. ఆ సమయంలోనే కథా నాయకుడు రాజకీయాల్లో చేరి దేశాభ్యుదయం కోసం పాటుపడతాడు, చాలా కష్టాలూ పరీక్షలూ ఎదుర్కొన్న తరువాత వీళ్లిద్దరూ, మీనాంబాళ్ గోవిందరాజన్‌లు, కలిసికొని వివాహమాడి భారతదేశ ఔన్నత్యం కోసం పాటుపడేందుకు కంకణబద్ధులౌతారు. వాళ్ల జీవితాల్ని ఒక ప్రత్యక్ష యజ్ఞంగా భావించమని అశ్వినీబాబు చెబుతాడు

అస్పృశ్యతా నిర్మూలనం వస్తువుగా కల్గిన కథల్లో "ఐదు బురుజుల కోట" అస్పృశ్యుల్ని (హరిజనుల్ని) నిర్లక్ష్యంచేసి తిరస్కరించడంవల్ల, దేశనిర్మాణయత్నంలో ఎటువంటి లోపం కల్గుతున్నదో చక్కగా నిరూపిస్తున్నది కోటకు నాలుగు బురుజులు గట్టివి, అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలని భావం కాని ఐదవ బురుజుమట్టిది కావడంవల్ల శత్రువు దాని ద్వారా సులభంగా లోన ప్రవేశించి దేశాన్ని కొల్ల గొట్ట గల్గుతున్నాడు. ఐదవ బురుజు అనగా 'పంచములు'. భారతి తర్వాత ఏ కథకుడు కూడా సంఘ సంస్కరణనూ సృజనాత్మక భావననూ ఇంత చక్కగా మేళవించి, పాఠకులను ఆకట్టుకునే కథను, చిత్తద్రుతిని కలిగిస్తూ ఆలోచన పురికొల్పే విధంగా రచన చెయ్యలేదని చెప్పవచ్చును. ఆనాటి అపోహల్ని తొలగించేందుకు భాషలోని కొన్ని పదాలకు అలవోకగా వ్యుత్పత్తి అర్థాల్నీ వ్యాఖ్యానాల్నీ కల్పించాడాయన ఒక్క ఉదాహరణ చాలు:

"'పరయా' అనే శబ్దం అవమానకరమైందని భావించి కొందరు దాని బదులు 'పంచమ' అనే పదాన్ని వాడుతారు. నేను కూడా అప్పుడప్పుడు 'పంచమ' అనే అంటాను. కాని 'పరయా' అనేది తమిళనాడులో వీళ్ళను అనాది నుంచీ పిలుస్తున్న పేరు. 'పరై' అంటే యుద్ధ నగారా. పూర్వకాలంలో ఈ వర్ణానికి చెందిన వారు, రాజులు యుద్ధయాత్రకు బైలుదేరినప్పుడు నగారా మోగించేవారు. అది వారికే చెందిన గౌరవం. మద్రాసులో 'పరయా సమాజం' అనేది ఉన్నది. 'పరయా' అని వ్యవహరించడం తప్పుకాదు. వాళ్ళని నీచంగా చూడడమే పరమ దోషం."

చివరగా భారతి వ్రాసిన జంతు ప్రపంచం కథల్ని మనం గుర్తించాలి. "కుయిల్ పాట్టు"లోనూ, భారతి వ్రాసిన ఇతర పాటల్లోనూ, చెట్టు చేమల్ని గురించీ పశుపక్ష్యాదులను గురించీ ఆయన వ్రాసిన విధానం చూస్తే, ఆయనకు కట్టు కథల ప్రక్రియమీద ప్రత్యేకమైన అభిమానం ఉన్నట్లు తెలుస్తుంది. దానికి ప్రేరణ "పంచ తంత్రం" నుంచి వచ్చింది. ఆయన వ్రాసిన "నవతంత్ర కథలు" దాగిఉన్న సత్యాలను వెలికితీసి వివరించే తెలివైన ప్రయత్నం, అని చెప్పాలి. రోజా అనే సర్పకన్య సాహసాలూ, మణి అయ్యర్ బుద్ధి కుశలతతో వేసే ఎత్తుగడలూ, వివేక శాస్త్రి పన్నే తంత్రాలూ మనల్ని ఆకట్టుకుంటాయి. ఈ కథల్లోని నీతిని గూర్చి శాస్త్రి చెప్పిన సారాంశం ఆలోచింప దగింది.

"దైవంపట్ల భక్తి ఎప్పుడూ ఫలితాన్నిస్తుంది. కాని ఆ భక్తికి అవగాహన తోడు కావాలి. అజ్ఞానుల విశ్వాసానికి ఆ శక్తి ఉండదు. మొదట మంచి జ్ఞానం కోసంమనం దేవుణ్ణి ప్రార్థించాలి. ప్రపంచ జ్ఞానం అన్ని సంపదలకూ మొదటి మెట్టు. అదిలేనివాడు గ్రుడ్డివాడే. నిజమైన భక్తికి ప్రపంచ జ్ఞానం అనే ఇంగిత జ్ఞానం ఎప్పుడూ తోడై ఉంటుంది."

## అధ్యాయం 10.

# ప్రబోధాత్మకాలూ, తాత్త్వికాలూ

భారతి "జ్ఞాన రథం" మామూలు సాహిత్య విమర్శ సూత్రాలకు లొంగే రచన కాదు కథాత్మక రూపకం, ఆదర్శ రాజ్యం, ఊహా వైచిత్రి, వాస్తవికత, ఈ అన్నింటి మిశ్రమంగా హాస్య దృష్టి మేళవింపుతో తయారైన రచన. ఇందులో రచయిత జ్ఞాన రథమెక్కి చిత్తవృత్తి అనే ప్రేయసితో కలిసి పయనిస్తాడు చిత్త వృత్తి ప్రక్కన ఉంతడంవల్ల "ఉపశాంతి" లోకంలో అతనికి ప్రవేశం లభించదు "గంధర్వ" లోకం అతనికి స్వాగతం చెబుతుంది. అక్కడ వెన్నెల కిరణాలు సంగీతం ఆలపిస్తాయి. సర్వమూ లావణ్యంతో మెరిసిపోతూ ఉంటుంది:

"అదిగో, సముద్రం తరంగాలు మెరుపు తీవెల్లా మారుతున్నాయి వెన్నెల్లో. ఓడలు తెల్లని పూలరాసుల పర్వతాల్లా ఉన్నాయి. దూరంలో చిన్న పడవలు హంసల్లా తేలియాడు తున్నాయ్. పైన చందమామ, వెండి మబ్బులు కొన్ని మబ్బులు విప్పారిన వలలు. కొన్ని నురగలు కక్కే అలలు, పువ్వులు విరజిమ్మి నట్లుందొక మబ్బు. కొన్ని మబ్బులు ఆకసపుటద్దంలో పడవల ప్రతిబింబాల్లా ఉన్నాయి. తారలు! ఆకసపు కడలిలోకి ఒలికిన రత్నాలు! ఆనంద ఖండాలు! ఆకాశ సరసిలో విరిసి, చిత్త మధుపాలచే అన్వేషింపబడుతున్న అసంఖ్యాక పుష్ప సందోహం! అనంతాకాశం అనంత సత్త్వంతో సంగమించినప్పుడు చెల రేగిన ఉల్కాపాతం!" తర్వాత రచయిత సత్యలోకాన్ని ప్రవేశిస్తాడు ఆ లోకపు తీవ్రతకు తట్టుకోలేక భూలోకానికి తిరిగి వస్తాడు. అక్కడ మనుష్యుల తొక్కిస లాటతో నిండిన మురికి వాడల్నీ, మధ్య తరగతి వారి అగచాట్లనీ వర్ణిస్తాడు వీటైతే రచయిత వీటినుంచీ తప్పించుకొని పారిపోవాలనుకుంటాడు. మళ్ళీ తన రథం ఎక్కి 'ధర్మ' లోకంలో విహరించేందుకు వెడతాడు. అక్కడ డాంటే కవి వర్ణించిన దృశ్యాల్లాంటివీ, అందులో రచయిత తాను నరక యాతన పొందిన స్వప్నాను భూతీ, వర్ణింపబడింది తద్వారా, తుచ్ఛమైన కోరికల పర్యవసానం మృత్యువు కాదు, 'బ్రతుకులో చావు' వంటి పీశకల, అని ఆయన గ్రహిస్తాడు. ఆ స్థితిని ఆత్మనైచ్యానికి పరాకాష్ఠయైన భయానక స్థితిగా తెలుసుకుంటాడు. వెంటనే అగ్ని ప్రవేశంచేసి, చిత్తవృత్తి తాలూకు మాలిన్యంనుంచీ పునీతుడై 'యమ' ధర్మమూర్తి

సన్నిధిని చేరుతాడు. ఆ ధర్మమూర్తి బాలగంగాధర తిలక్ పోలికల్లో కనిపిస్తాడు! జాతీయ రాజకీయాల్లో తనకు నాయకుడైన మహావ్యక్తికి భారతి అర్పించిన నివాళి యిది. కణ్వ మహర్షి వర్ణ ధర్మాలనుగూర్చి వివరించి దేశభక్తుని కర్తవ్యాన్నిగూర్చి భారతికి ప్రబోధిస్తాడు. ప్రపంచంలోని కశ్మలం అనుకున్నంత మాత్రాన తొలగిపోదు. దాన్ని దరిజేరనీయకుండా మానవుడు నిరంతరం ప్రయత్నించాలి. ధర్మమార్గం సూక్ష్మమై కత్తిమీద సాములా ఉంటుంది. దాన్నుంచీ ఏ కించిత్తు తప్పి ప్రవర్తించినా ధర్మలోకంనుంచీ చ్యుతి తప్పదు

'తరాసు' (త్రాసు), 'సుమ్మ' (విశ్రాంతిలో) అనేవి రెండు వ్యాస గుచ్ఛాలు. సులభమైన శైలిలో వ్రాయబడిన ఈ రచనలు మనల్ని లోతుగా ఆలోచింపజేస్తాయి. భారతిచెప్పే ప్రబోధ వాక్యాలు ఎన్నో స్మరణీయాలై ఉల్లేఖింపదగినవిగా వున్నప్పటికీ, ఇక్కడ ఒక్క ఉదాహరణ మాత్రమే ఇస్తాను:

"ధనంకంటే కీర్తికోసం నేతపని చేబూనడం ఉదాత్తమైన విషయం. ధనం మంచిదే, కాని చేసే పనిలో నేర్పు అంతకంటే ఎక్కువ విలువైనది. కవిత్వంవ్రాస్తే బెనారస్ పట్టునేతలాగా వుండేట్టు వ్రాయాలి. లేదా కర్షకులు కట్టుకునే ముతక ధోవతిలా వుండేటట్టు వ్రాయాలి. మరమగ్గాల నేతవల్ల లాభంలేదు. మస్లిన్ గుడ్డకు మన్నికలేదు కవిత్వంలో సత్త్వం, విస్పష్టత, ఉదాత్తత, లోతు, వ్యక్తిత్వం తప్పకుండా వుండాలి. దానికి కొంత రంగుకూడా జోడించవచ్చు. కాని రంగులేకుండా తయారు చేయగలిగితేనే మేలు."

పతంజలి 'సమాధి పథం', వేదాల్లోని 'ఋక్కులు', వీటిని గురించి భారతి చేసిన వివరణలూ, 'భగవద్గీత'కు (తమిళ తర్జుమాతోబాటు) ఆయన వ్రాసిన పీఠికా, ఆయన వచన శైలి ఉత్కృష్టతకు మచ్చు తునకలు. నిదానంగా, తేట తెల్లంగా, శక్తిమంతంగా భావానుగుణంగా తీర్చిదిద్దబడిన శైలి ఆయనది. ఎంతో గహనమైన భావాలు కూడా అలతి పదాలతో వ్యక్తంచేసే శైలి. 'గీత'కు వ్రాయబడిన పీఠికలో ఈ గుణం మరీ చక్కగా తెలుస్తున్నది. సన్యాసియొక్క వైరాగ్యాన్నీ, భౌతికవాదియొక్క నాస్తికత్వాన్నీ తప్పించుకుంటూ, ఎంతో చాకచక్యంగా భారతి 'గీత'యొక్క మూల సందేశాన్ని "కర్మ సన్యాస యోగం"గా వివరించాడు. జీవితాన్ని నిరాకరించడం ద్వారా మనిషి జ్ఞాన సిద్ధి పొందజాలడు. 'సంసారం'లో వుంటూనే కర్మ ఫలితాన్ని ఆశించక పోవడం ఒక్కటే దానికి మార్గం. నిత్య జీవితంలో పరిశుద్ధంగా వుండడం ద్వారానే దివ్య జీవనం సాధించేందుకు వీలౌతుంది.

## అధ్యాయం 11.

# ఇంగ్లీషులో వచనమూ, పద్యమూ

హైస్కూలు విద్యార్థిగా వున్నప్పుడు భారతికి ఇంగ్లీషు భాషమీద గట్టి విముఖత్వమే వుండేది కాని తర్వాత బెనారస్‌లో గడిపిన రోజుల్లో ఆ భాష యొక్క అందాన్నీ ఉపయోగాన్నీ గ్రహించడంతో, ఆయన మళ్ళీ ఎట్టాయపురం తిరిగి వచ్చేనాటికి షెల్లీ కవిత్వం తలకెక్కి, పూర్తిగా ఆ మత్తులో ఉండినాడు తమిళ దినపత్రికలో ఉపసంపాదకుడుగా పనిచేస్తున్నప్పుడు, రాజకీయ తాత్త్విక ఉపన్యాసాలను తమిళంలోనికి తర్జుమా చేయడం ఆయన పనిలో భాగంగావుండేది. అందువల్ల ఇంగ్లీషు వచనంలోని శబ్దలయమీద ఆయనకు ఆసక్తి ఏర్పడింది. తర్వాత పాండిచ్చేరిలో శ్రీ అరవిందులతో పరిచయం ఏర్పడ్డాక ఈ ఆసక్తి మరింత ఎక్కువైంది. శ్రీ అరవిందులు భాషకు ప్రభువు. ఆయన ఇంగ్లీషు అత్యంత ప్రతిభతో వ్రాయడం భారతిని ప్రభావితుణ్ని చేసింది. భారతి ఇంగ్లీషులో అప్పుడప్పుడు వ్రాసినవీ, ఆయన ఇంగ్లీషులోకి తర్జుమాచేసినవీ రెండు సంపుటాలు దాకావున్నవి- "అగ్ని, ఇతర పద్యాలూ, అనువాదాలూ," "వ్యాసాలు, ఇతర వచన రచనలు." ఇప్పటికి అర్ధ శతాబ్దపు నాటివైనప్పటికీ, ఈ రచనలు ఆధునికతతోను, జీవకళతోను, కొత్తదనం కలిగివున్నవి భారతి తన పద్యాల్ని తానే తర్జుమా చేసుకోవడం ఒక విచిత్రం. ఉదాహరణకు ఈ క్రింది ఖండికలో ఎగసిపడే శబ్ద లయను చూడవచ్చు:

Deep Attraction thou to me,
Living Magnet I to thee;
Thou to me the Veda pure
And I to thee the Knowledge sure,
Voice vibrant of the world's Desire,
O Krishna, Love, all-quickening Fire,
In utter stillness, here, I see
Thy face that yieldeth ecstasy.
As Life to Pulse, and Gold to rings,
As star to Planet, Soul to things,
So Krishna, Love, art thou to me,
Thou, the Force, I, Victory -
And all the joys of Heaven and Earth
In thee, O Krishna, have their birth,
Eternal glory, endless Might,
O Heart of Mine, O Light, O Light!

"గొప్ప ఆకర్షణ నీవు నాకు,
సజీవ కాంతం నేను నీకు
నీవు నాకు వేదం అచ్చం
నేను నీకు జ్ఞానం నిజం..."
లోకం వాంఛలు నినదించే నీకంఠం
ఓ కృష్ణా, ప్రియా, నా సర్వం రగిల్చే నీతాపం
ఈ నీరవ నిస్తబ్ధతలో కనిపించే
నీరూపం రసోద్వేగం కలిగించె.
స్పందనలో జీవం, నగల్లో స్వర్ణం
గ్రహానికి నక్షత్రం, జడానికి ఆత్మ
కృష్ణా, ప్రియా, నాకు నీవు.
నీవు శక్తివి, నేను విజయాన్ని
స్వర్గ మర్త్య సుఖభోగాలన్నీ
నీలో కృష్ణా, ఉదయించు.
అమరకీర్తీ, అనంతశక్తీ,
ఓ నాహృదయమా, ఓ జ్యోతీ, ఓ జ్యోతీ!"

ఎనిమిదవ శతాబ్ది వైష్ణవ యోగుల కఠినమైన కవిత్వాన్ని కూడా బైబిలులోని ప్రబోధంవలె ఆయన భాషాంతరీకరించాడు:

"వెళ్ళండి, అమరుడైన ప్రభువు సేవచేసి జీవించండి పాటలు పాడండి, వేదంలోని పవిత్రమైన ఋక్కులను పాడుతూ జ్ఞాన సూత్రాలను పాటించండి. ఈ భూమి మహాత్ములతో సౌభాగ్యవంతమైనది; వారిని పువ్వులతో, చందనంతో, సుగంధ ధూపాదులతో ఎందరో భక్తులు సేవిస్తున్నారు ...

"ఈ వర్ధమాన లోకాల్లోని వాళ్ళందరూ, ఆ కృష్ణుని మనోహర రూపాలే, తామర తంపరై వ్యాపించి అంతటా నిండిపోతున్నారు–దిగంబరుడైన రుద్రుడూ, ఇంద్రుడూ, బ్రహ్మ, అందరూ వున్నారు....కలియుగం సమాప్తి—మీరందరూ ఏకమై వీరిని కొలవండి."

భారతి ఇంగ్లీషు వచనం అరవిందుల వారి శైలియొక్క ప్రత్యేకమైన అందు దనాన్నీ, మృదుత్వా పుణికి పుచ్చుకొన్నది. ఇందులో ఆశ్చర్యమేమీలేదు "దివ్య జీవనం" గ్రంధాన్ని వ్రాసిన అరవిందుల వారితో పాండిచ్చేరిలో భారతికి ఎర్పడిన స్నేహం మనం గుర్తుకు తెచ్చుకోవాలి ఉదాహరణగా ఆత్మ సమర్పణాను గూర్చి భారతి వ్రాసింది చూడండి—

"విశ్వానికి అంకితమైన జీవితాన్ని సాధించాలంటె ఆత్మసమర్పణం విధా యికం. మనుష్యులు తమ ధనాన్నీ, ఆస్తిపాస్తులనూ, హక్కులనూ, చివరకు ప్రాణాల్నీ, మతంకోసం వదులుకోవడానికి సిద్ధపడతారు కాని వాళ్ల మానవ సహజమైన అహంకారాన్ని మాత్రం దివ్యమైన ఆత్మ సిద్ధికోసం వదలు కొమ్మంటే వాళ్లలా చెయ్యలేరు. అయితే అన్ని గొప్ప మతాలూ అలా చెయ్యమనే చెపుతాయి. మర్త్యభావన అనే సారాయి మనందర్నీ వ్యామోహితుల్ని చేస్తున్నది—కాని విశ్వ సత్యం అనే ప్రజ్వలితాగ్నిలో 'నేను' దూకడంవల్ల, నన్ను నేను కోల్పోవడంలేదు. ఆ అగ్ని పరీక్షనుంచీ ప్రకాశిస్తూ మరణ విజేతగా బైటికి రావడమే జరుగుతుంది. సోదరీ సోదరులారా, ఆ పరంజ్యోతిలో ఐక్యం కావడం ద్వారా అమరత్వాన్ని పొందడానికి ప్రయత్నిద్దాం రండి"

ఏ విషయం చూచినప్పటికీ, అమరత్వసిద్ధి, కర్మ సిద్ధాంతం, వర్ణ దురహం కారం, స్త్రీ విమోచనోద్యమం, భారతదేశ వారసత్వం, వాక్ స్వాతంత్ర్యం, వస్తువు ఏదైనా, భారతి మనతో ముఖాముఖిగా మాట్లాడుతూ, మన మనస్సుని పూర్తిగా ఆకట్టుకుంటాడు. యాభై ఏళ్లు గడిచిపోతేనేం, ఈ క్రింది వాక్యాలలో ఎక్కడైనా భావ తీవ్రత పదను తగ్గిందేమో చూడండి:

"వాక్ స్వాతంత్ర్యం, బుద్ధివున్న ఏ ప్రభుత్వానికైనా నిజమైన సహాయ కారియే. మనుష్యుల గొంతుల్ని నొక్కితే, వాళ్ల గుండెల్లో చేదుపోసి, కఠినంగా మార్చడం జరుగుతుంది. ఈ ప్రపంచం అంతా మనస్సుమీదే ఆధారపడింది: 'భావాలే పదార్థాలు?,

"ఒక ప్రాచీన భారతీయ రచయిత అంటాడు: వివేకం కలిగిన రాజు, పదిలక్షలమంది మూర్ఖుల గ్రుడ్డి విశ్వాస పాత్రతకన్నా ఒక వందమంది ఆలోచనా పరుల గౌరవాదరాన్ని ఎక్కువ విలువైనదిగా భావించాలి. ఏ ప్రభుత్వమైనా తన గౌరవాన్ని నిలుపుకోవాలంటే వాక్ స్వాతంత్ర్యాన్ని అన్ని విషయాల్లోనూ, అన్ని పార్టీలవారికీ అనుమతించడం దాని ప్రథమ విధి."

భారతి ఇంగ్లీషు రచనల్లో హేళనాత్మకమైన, హాస్యాత్మకమైన ధోరణి కని పించదు. కారణం ఆయన తమిళ భావ ప్రపంచాన్నిగాని, సంస్కార స్వరూపాన్ని

గాని, అందులోకి అనువదించే ప్రయత్నం చేయలేదు. అది తమిళ రచనల్లోనే అభివ్యక్తంచేశాడు. ఆయన పరిధులు ఆయనకు తెలుసు పరాయి భాషలో హాస్యాన్ని పోషించే ప్రయత్నం చాలా కృత్రిమంగా వుంటుందని బహుశా భావించి వుంటాడు. అయినప్పటికి హేళనాత్మక రచనచేసే ప్రయత్నం ఒక్కసారి బుద్ధి పూర్వకంగానే ఆయన చేశాడు దాని ప్రతులు బాగా అమ్ముడుపోయి, భారతి అనుకోని ఫలితాన్ని యిచ్చింది! శ్రీ అరవిందులు, భారతి వ్రాసిన ఉత్తమ రచనల్లో ఒకటిగా దాన్ని ప్రశంసించారు "బంగారు తోకగల నక్క" అనే ఆ రచన, కడుపుబ్బ నవ్విస్తూ, హృదయాన్ని కవ్వించే కట్టు కథ. దాని అంత రార్థాన్ని గురించి భారతి 1914 లో రెండవ కూర్పునకు వ్రాసిన పీఠికలో ఇలా చెప్పాడు :

"ప్రాచీన హైందవులు ఆధ్యాత్మిక సాధనలో ఉన్నత జ్ఞాన శిఖరాల్ని అధిరోహించినట్లు అందరూ అంగీకరిస్తున్నదే. కాని గడచిన తరం హైందవులు, ముఖ్యంగా ఇంగ్లీషు చదువు నేర్చినవారు, ఏ దేశమూ ఏ యుగమూ ఎరుగనంతటి అమాయకులై వంచింపబడ్డారని నా అభిప్రాయం. ఈ తరానికి చెందిన మేము చేసుకొన్న దృఢ నిశ్చయం ఏమంటే వంచకులు ఈ దేశంలో తమ వ్యాపారాలను నిశ్చింతగా సాగించడం యికనుంచీ అసాధ్యమయ్యేలా చెయ్యాలని అదే ఈ కట్టు కథయొక్క గుప్తార్థం"

ఆ కట్టు కథ ఈనాటి పరిస్థితులకూ అన్వయించేలాగే వున్నది. ఏమంటే గిల్టు తోకతో కనిపించే అటు నక్క కోవకు చెందిన వ్యక్తులు ఇటీవల చాలమంది తయారయ్యారని తోస్తుంది.

అవహేళనాత్మకమైన ఈ చిన్న రచన తప్పితే, భారతి ఇంగ్లీషులో వ్రాసిన రచనలన్నీ మామూలు ధోరణిలో వ్రాసినవే. అందువల్ల భారతి ఇంగ్లీషు వచన రచనల సంపుటిని పరిచయంచేస్తూ సి ఆర్. రెడ్డి, కె. ఎస్ వెంకటరమణిగారలు ఈ క్రింది విధంగా వ్రాయడంలో ఆశ్చర్యం లేదు :

"భారతివంటి కవితాత్మ, మాతృభాషలో ఊహించలేని సౌలభ్యంతో ఆనంద విహారం చెయ్యడంనుంచీ ఒక పరాయి భాషకు మళ్ళినప్పుడు, ఆత్మాభి వ్యక్తి ప్రసాదించే ఆనందంకోసం ఆ రీతితో ప్రయత్నించినప్పుడు, ఆ శిల్పం తీవ్ర మైన ఆలోచనా భారంతో బరువుగా వుండడంలో ఆశ్చర్యంలేదు. కళలో కూడా ఆత్మాభివ్యక్తియొక్క ఉత్తమోత్తమ లక్ష్యం ఆత్మజ్ఞాన సిద్ధి ఒక్కటే అవుతున్నది. భగవంతునికోసమైనట్టి గాఢానురక్తి, ప్రతి గీతంలోనూ, ప్రతి పుటలోనూ ఇక్కడ గోచరమౌతున్నది."

## అధ్యాయం 12.

# జీవ భాష

ప్రఖ్యాత తమిళ రచయిత, పి. శ్రీ., యువకుడుగా వున్నప్పుడే భారతి కవిత్వానికీ వ్యక్తిత్వానికి సమ్మోహితుడై, భారతిని కొలంబస్‌తోపోల్చాడు. ఆ ప్రఖ్యాత నావికునివలెనే భారతికూడా తమిళభాషా సాహిత్యాల మహోజ్జ్వలతను పునర్దర్శించి అర్వాచీన తమిళులకు ఆనంద మాధుర్యాలను అందజేశాడు లేకపోతే వారి భావ సంస్కారం, శతాబ్దాలుగా, అనుకరణ, చర్విత చర్వణం ప్రధానమై, నవ్యతను కోల్పోయిన కవిత్వంతో, మృతప్రాయమై వుండినది ఒక విధంగా ఆయన చేసింది కవితా స్వాతంత్ర్యాన్ని ప్రకటించడం, అంటే గతంలోని నిషేధాలనుంచీ, రసహీనమైన శుష్కధోరణులనుంచీ, విముక్తిని చాటడమే. అంతే కాకుండా అది పురాణాల సంప్రదాయానికి కట్టుబడిన బలహీనతనుంచీ బైటపడటం కూడా అయింది. తమిళ సాహిత్య నిర్మాతలైన మహత్తరమూర్తి త్రయానికి — వళ్లువర్, ఇళంగో, కంబన్—ఆయన మనస్ఫూర్తిగా నివాళులర్పించాడనటంలో సందేహంలేదు. ఆయన వచన రచనలన్నీ తమిళకవుల వాక్యాలతో వెలుగొందుతూనే వున్నాయి తన కవిత్వంలో భారతి పూర్వులు అందించిపోయిన ఛందస్సులనే వాడుకున్నాడు కూడా. కాని భాష విషయంలో, అది తగిలించుకున్న ఆభరణాలనూ అలంకారాలనూ తొలగించివేసి, గ్రంథస్థమైన భాషకూ వ్యవహార భాషకూ గల తేడాలను తగ్గించివేసి, తన రచనల్లో పాశ్చాత్య పునర్వికాస, ప్రజాస్వామ్య ఉద్యమాల భావ సంచలనాన్ని (వ్యక్తిత్వమూ, సమానత్వమూ, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వము) ప్రవేశపెట్టి, తన రచనా వ్యాసంగ మందిరంలో జానపద గాథలకూ, పల్లెపదాల ఛందస్సుకూ, ఆ పాటల తాళగతులకూ స్థానం కల్పించి, భారతి అభిరుచుల్లోనే ఒక తీవ్రమైన, మహత్తరమైన విప్లవానికి కారకుడయ్యాడు. దానికి ఫలితంగానే, ఆయన శ్రమ, ఆయన కృషి పుష్కలంగా పండి, తమిళ భాష నేడు భారతదేశంలో అతిసంపన్నమైన సాహిత్యాన్ని కలిగివున్న భాషల్లో గణనకు వచ్చింది.

భారతిచేసిన భాషాసేవలో ప్రధానమైనది, అలతి పదాలకున్న నిక్షిప్తమైన శక్తిని గుర్తింపజేయడం తమిళ వచనం ఆదిలో ఆలస్యంగా ప్రారంభమై,

సవ్యంగా వృద్ధిపొందలేదు. భారతి రంగంలో ప్రవేశించే నాటికి అది ఇంకా అతి శయోక్తులతోను, అన్వయ క్లిష్టమైన వాక్య నిర్మాణంతోను, చాల బరువుగావుండేది భారతి అనవసర శబ్దాడంబరాన్ని తొలగించివేసి, తాను మాట్లాడే తీరులో సూటిగా వ్రాయడం ప్రారంభించాడు. తమిళ పాఠకులు ఆనందాశ్చర్యాలతో కేకవేశారని చెప్పాలి, ఎలాగంటే మోలియర్ నాటకంలో యమ్ జోర్డేన్ అనే పాత్ర తాను మాట్లాడుతున్నదంతా వచనమే అని వినగానే ఆనందాన్ని ప్రకటించినట్లు!

భారతి వ్రాసిన తమిళం సర్వత్రా నిరాడంబరంగా, సూటిగా, శక్తి మంతంగా వుంటున్నదంటే, దానికి కారణం ఆయనలోని భావావేశాన్ని ఆయన క్రమంగా భాషలోనికి ఆవేశింపజేస్తూ, మామూలు సంభాషణలో దొర్లే పదాలకే ఎంతో తీవ్రతనూ, అర్థాన్నీ ఆపాదించడమే. ఒక రాజకీయ సంబంధమైన కరపత్రం కాని, ఒక సామాజికశాస్త్ర నివేదిక కానీ, ఒక సాహిత్య వ్యాసం కానీ, ఒక కథా నిక కానీ, ఏదైనా సరే, మాటలు, వాక్యాలూ ప్రయత్నంలేని సౌలభ్యంతో ప్రవ హిస్తాయి. ఒక వ్యాసం ఇలా ప్రారంభమౌతుంది, అందులో పాండిత్య ప్రకర్షతో కూడిన బరువైన పరిచయ వాక్యాలేమీ వుండవు:

"కంకిలాగ చిట్టి ముక్కు, చిన్ని కళ్ళు, చిన్న తల, తెల్లమెడ, పాలమీగడ లాంటి పట్టు-మెత్తని చక్కని పొట్ట, పట్టు-మెత్తని వీపుపై నలుపు తెలుపు కలిసిన బూడిద రంగు, చికిలి ఈకలు, ఎంతో చిన్నని కాళ్లు"

ఊర పిచ్చుకల ప్రేమ జీవనాన్ని గూర్చిన వర్ణనలో మనం వెంటనే లీనమై, ఆ పక్షుల స్వేచ్ఛలో, మానవులు బ్రతుకు కోసం పడే అగచాట్లలో, కర్మ యోగంయొక్క అవసరంలో, అనాసక్త కర్మయొక్క ఉత్కృష్టతలో, జ్ఞాన లబ్ధికి అది ఏకైక మార్గం కావడంలో, క్రమంగా నిమగ్నులమై పోతాం. రచయిత తన పాఠకునితో యథాలాపంగా, ఒక చక్కని నాటకీయత మేళవించిన భాషణం,ముఖా ముఖిచేస్తున్న రీతిగా, అత్యంత సహజంగా వుండడంవల్ల, ఆయన వచనం మళ్ళీ మళ్ళీ ఇతోధికంగా అదే కావాలనే తృష్ణను తమిళ పాఠకుల్లో కలిగించింది. అనతి కాలంలోనే ఇతర తమిళ రచయితలు భారతిని అనుకరించడం ప్రారంభించారు. వాళ్ళుకూడా సొంతంగా విజయాలు సాధించారు. 'కల్కి', నా. పిచ్చామూర్తి, 'అఖిలన్', 'జయకాంతన్', రాజం కృష్ణన్, వెంటనే మనస్సులో మెదిలే రచయితల పేర్లు. నిజానికి ఇప్పుడు వ్రాస్తున్న ప్రతి రచయితా భారతి సంప్రదాయంవల్ల ప్రభావితుడైనవాడే.

ఒక్క దెబ్బతో భారతి తమిళ కవిత్వానికి పాత పాండిత్య శృంఖలల నుంచీ విముక్తి కలిగించాడు. ఆయన మొదట్లో వ్రాసిన కొన్ని కవితలకు (''స్వాగితము వంగదేశమా'' వంటివి, బెంగాల్ విభజన తర్వాత వ్రాసినవి) అధోజ్ఞాపికలు, కష్టమైన పదాలని వివరించేవి, అపసరమౌతూ వుండేవి కాని తర్వాత వ్రాసిన కవిత్వంలో, ప్రాచీన ప్రయోగాలు కాని, అర్థం తెలియని పదాలుగానీ బొత్తిగా లేవు. 'ఆశయాలు' అనే చిన్న కవిత నొక ఉదాహరణగా తీసుకోవచ్చు అందులో వరుసగా కొన్ని కోర్కెల్ని ఇంచుమించు వచన ధోరణి లోనే పేర్కొనడం వుంది, కాని ఆ పదబంధాలలో, కూర్పులో, ఇమిడివున్న ఆవేశం, ఈ పద్యాన్ని చక్కని రచనగా పరిగణించేలా చేస్తున్నది :

''సాహస హృదయం
స్వాదు భాషణం
చక్కని ఊహాలు
అందిన ఫలాలు
త్వరిత లాభాలు
ఫలించిన స్వప్నాలు
భాగ్యం భోగం
ఇలలో పేరు.

నిశ్చిత దృష్టి
సంకల్పిత చర్య
స్త్రీల విముక్తి
సస్య శ్యామల ధాత్రి
దైవానుగ్రహము
ధర్మ విజయము
సరికొత్త దివి
సరికొత్త భువి,''

కన్నులు చెమర్చి హృదయం తెలీని బరువుతో నిండిపోతుంది మనం ఈ చివరి మాటలు చదివితే

"ఈ చెట్టు పెంచాము, స్వామీ
నీళ్ళతో కాదు, కన్నీళ్ళతో
మా గుండె వ్రీలదా,
ఈ చెట్టు వాడిపోతే ?"

తమిళ కవులు భారతి వరవడిలో నడిచేందుకు ఆలస్యం చెయ్యలేదు దేశిక వినాయకం పిళ్ళై, నమక్కల్ రామలింగం పిళ్ళైవంటి రచయితలు ఆయన మార్గ దర్శకత్వంలో ఎన్నదగిన విజయాలు సాధించారు. ఈ ఇద్దరు పిళ్ళైల తర్వాత వచ్చిన వందలాది కవులు సైతం పాండిత్య ప్రకర్షను వదలిపెట్టారు. కాని 55 ఏళ్ళ క్రితం భారతి ఆకస్మికంగా మనల్ని విడిచి వెళ్ళినచోటే మనం ఇప్పటికీ వుండిపోయాం. తమిళ వచనం భారతి మార్గంలో శిఖరాన్నుంచీ శిఖరానికి పైకి ఎగబ్రాకుతూ వుండగా, కవిత్వం మాత్రం విశేషంగా కొత్తది అని చెప్పగలిగిన లక్షణమేమీ సంతరించుకొనలేదు కె పి రాజగోపాలన్, పుదుమై పిత్తన్, నా. పిచ్చామూర్తి వచన కవిత్వంలో భారతి మార్గాన్ని అనుసరించి కొంతవరకు నవ్యత ప్రవేశపెట్టగలిగారు అయినప్పటికీ, వాళ్ళందరూ భారతి, టాగూరు కవుల ప్రతి ధ్వనులుగానే కనిపిస్తారు, అర్ధశతాబ్ది దాటినా ఇప్పటికీ ఈ కాలాన్ని మనం భారతియుగంగానే పరిగణిస్తున్నామంటే, దానికి ఇదీ ఒక కారణం.

## అధ్యాయం 13.

## ఇతివృత్తంలో వస్తువులో ఆధునికత

భారతి వచనంలో కవిత్వంలో భాషా విప్లవాన్ని తీసుకురావడం, ఆయన పట్ల తమిళులు కృతజ్ఞతా బద్ధులై వుండటానికి గల కారణాల్లో ఒక్కటి మాత్రమే.

ఇతివృత్తంలో, వస్తువులో, ఆయన తెచ్చిన విప్లవం కూడా దానికి సమాన ప్రాముఖ్యాన్ని కలిగివున్నది. పి. మహాదేవన్ గారన్నట్లు :

"ఆయన తమిళ సాహిత్యానికి ఉదయతార. 'కవిత్వశైలి' అనే పద్ధతిని నిరాకరించిన వారిలో ప్రథముడాయన. జీవితానికి సన్నిహితంగా వుండే ఇతివృత్తాలను గ్రహించడంలోనూ ప్రథముడే"

పూర్వపు రోజుల్లో, తమిళ కవి ఎప్పుడోగానీ 'సామాన్యమైన ఇతివృత్తాన్ని స్పృశించేవాడు కాడు ('ముక్కుదల్ పల్లు' అనే ప్రసిద్ధ రచన పల్లర్ అనే అస్పృశ్యుల జీవితాన్ని గురించి). ఏమైనప్పటికీ, భారతి తర్వాతి కాలంలోనే ఇతివృత్తాన్ని ఎన్నుకోవడంలో స్వేచ్ఛ రచయితల్లో బహుళ ప్రచారంలోకి వచ్చింది భారతి వ్రాసిన కవితలు, 'మారవజాతి పాట', 'బండివాని పాట', 'చెరకు తోటల్లో' వంటి రచనల తరువాతనే సామాజిక రాజకీయప్రధానమైన ఇతివృత్తాలు, దేశిక వినాయకం పిళ్ళై వంటి గేయ కవులచేత విరివిగా గ్రహింపబడుతూ వచ్చాయి. భక్తి సంబంధమైన భావాల్లో చిలుక పలుకుల్లా పాత మాటలే వల్లించడమూ, పురాణాలనూ కావ్యాలనూ సుదీర్ఘంగా తిరిగి వ్రాయడమూ వంటి పద్ధతులు పోయి, భక్తిభావానికీ దైవసంబంధమైన ఇతివృత్తాలకూ ఒక క్రొత్తదారి ఏర్పడింది భారతి పాతబడిన, అరిగిపోయిన విశేషణాలను వర్ణనలను గుప్పించే పద్ధతి విడనాడి, భగవద్విషయంలో సాక్షాత్తు సన్నిధానంలో నిలబడిన రీతిగా, తన ఆశయాలను నిత్య వ్యవహార భాషలో వ్యక్తం చేస్తాడు. ఉదాహరణకు 'శ్రుతిచేసిన వీణ' పద్యాన్ని చూద్దాం :

"వీణా తంత్రులను సవరించి శ్రుతిచేసి,
దాన్ని చెత్తకుప్పపై గిరవాటు వేద్దామా ?
ఆలించు, తల్లీ శక్తిమతీ! నీవు జీవితాన్ని ప్రసాదించి,
బుద్ధి దీపాన్ని వెలిగించావు—
నా తలఁపుల్ని చేతలుగా మార్చగలిగితే తప్ప,
భారం, ఈ బ్రతుకు భూమికే భారం.
కర్తవ్య దీక్ష ప్రసాదించు,
దేశ సౌభాగ్యాన్ని సాధిస్తాను."

అలాగే, ఆయన తన శ్రోతలతో ఈ క్రింది పద్యాన్ని భక్తావేశంతో మళ్ళీ మళ్ళీ జపిస్తే తప్పక దైవ సాక్షాత్కారం లభిస్తుందని చెప్పినప్పుడు వాళ్ళు సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు:

''ఆనంద సంధాయకా, ఓ స్వామీ!
ఆనంద దాయకా, స్వామీ, స్వామీ!
జడ పదార్థాన్ని చైతన్య విలసితం చేసి
ఈ విచిత్ర విశ్వాన్ని సృష్టించావు.
ఈ బహుళ వర్ణాంకిత లోకాలు
సౌందర్య రేఖా సౌష్టవ నిర్మితాలు.
ఆనంద సంధాయకా, ఓ స్వామీ!''

తమిళ వచనం విషయంలో, భారతి తర్వాత వచ్చిన రచయితలు ఆయన వ్రాసిన 'చంద్రికాయిన్ కదై' వరవడినుంచీ లాభం పొంది, తమ రచనల్లో సమకాలీన సమస్యల్ని, సామాజిక రాజకీయ ఆర్థిక సంబంధమైన వాటిని, తెగువతో చర్చించడం ప్రారంభించారు టాగూరు రచనల్ని భారతి తర్జుమా చేసింది మొదలు, ఆయన జాడల్లో అసంఖ్యాకంగా బెంగాలీ, మరాఠీ, హిందీ నవలలు తమిళంలోనికి తర్జుమా అవుతూవచ్చాయి. నిజానికి ప్రస్తుతం వస్తున్న ఈ తర్జుమాల వెల్లువ, ఆధునిక భారతీయ సాహిత్య రంగంలో సంభవించే భావ సంచలనాల, ఉద్యమాల, పరస్పర సంవాదానికీ, ప్రభావానికీ ప్రేరణగా వుంటున్నది గడచిన అయిదారు దశాబ్దులలో తమిళ వచనం బహుముఖాల అసాధారణమైన ప్రగతిని సాధించింది. దానికి కారకుడుగా చాలవరకు భారతికే కీర్తి దక్కుతుంది. ఆయనే, మొట్టమొదటసారిగా, తమిళ భాషను సమాచారం అందివ్వడానికి, ప్రబోధానికీ, జ్ఞానదీప్తి కలిగించడానికి అనువైన పరికరంగానూ జనప్రియంగానూ తీర్చిదిద్దాడు.

ఛందోరూపాలలో సుబ్రహ్మణ్య భారతి తాను కొత్తగా సృష్టించినవేమీ లేకపోయినప్పటికీ. ఆయన వాడుకలోనున్న ఛందస్సులను చాలా తెలివిగా ఉపయోగించుకున్నాడు. రైలుపెట్టెలో ప్రయాణంచేస్తూ ఒక బిచ్చగత్తె పాట విని వుండవచ్చు. తర్వాత కొన్నాళ్లకు ఆయన సృజనాత్మక ప్రతిభ ఆ పాట రాగ తాళాల్ని ఆధారం చేసుకొన్న ఒక కొత్త పాటని, దేశభక్తి పూరితమైన పాటగా

మారిన దాన్ని, ప్రజలకు అందజేసేది కట్టెలు చీల్చేవాని ఎగసిపడే శ్వాసవంటి లయతో కొన్ని పాటలు, అస్పృశ్యుల వాడల్లో వినిపించే డప్పుల నాదాన్ని అనుకరించే పాటలు, ఇవి వర్ణభేదాలను ధిక్కరించి జయించే విజయగీతాలుగా రూపొందేవి బుడబుక్కలవాని 'గుడు-గుడు-గుడు' ఒక్క త్రుటిలో లోకంలోని పీడితులకూ దీనార్తులకూ కొత్త జీవితాన్ని ప్రకటించే పాటగా తయారయ్యేది. అంతేకాదు! కవిత్వాన్ని ప్రజల ఉమ్మడి సొత్తుగా చేయాలనే భారతి పట్టుదల, ఆయన్ని ఈ జానపద సంగీత బాణీలో ఒక పూర్తి ఇతిహాస కావ్యాన్నే వ్రాసే సంకల్పానికి ప్రేరేపించింది చదువుల తల్లి సరస్వతీదేవి అనుంగుబిడ్డ కావడంవల్ల, ఆయన తన కలల్ని నిజంచేసుకోగల్గాడు అదే "పాంచాలీ శపథం" రచన. సాంప్రదాయిక ఛందస్సుల్లో రచింపబడిన పురాణాలూ, 'అంతాది'లూ, అసంఖ్యాకంగా చూచి విసిగిపోయిన తమిళ దేశపు కవితా ప్రవృత్తి, పాత కథల్నే కొత్త పద్ధతిలో అభివ్యక్తం చెయ్యగల ప్రతిభకోసం ఎదురుచూస్తోంది. అప్పుడు భారతి దానికి అవసరమైన మార్గాన్ని ఏర్పరిచాడు:

"సులభమైన పదబంధాలూ, నిరాడంబరమైన శైలీ, కష్టంలేకుండా స్ఫురించే తాళగతులూ, సామాన్యునికి అందుబాటులో వుండే ఛందస్సులూ— ఈ లక్షణాలతో కూడిన ఇతిహాసాన్ని రచింపగల వ్యక్తి మన మాతృభాషకు కొత్తగా ప్రాణం పోయగల కవి ఔతాడు.

"రెండు మూడేళ్లకంటే ఎక్కువ బడి చదువు చదవని తమిళ ప్రజకుకూడా అది అర్థమయ్యేలా వుండాలి. అట్లని కవితాభివ్యక్తియొక్క గుణమూ, స్థాయీ ఏమాత్రమూ తగ్గకూడదు.

"తమిళ భాషకు నవజీవనాన్ని కల్పించడానికి సంకల్పించిన పరాశక్తియే నన్నీ కార్యానికి పూనుకునేటట్లు ఉత్సాహపరచింది. అందువల్ల దీన్ని అందరూ ఆదరిస్తారని నమ్ముతున్నాను"

తమిళనాడులో కవితా భవితవ్యాన్ని గూర్చి భారతి దృష్టి యిలా వుండడం చేత, ఆయన కష్టమైన ఇతివృత్తాన్నే ఎన్నుకున్నాడు. అది "మహాభారతం"లో అత్యంత హృదయ విదారకమైన సన్నివేశం. ఎంతో నిగ్రహంతో, ఉదాత్తమైన విశ్వాసంతో నిర్వహించవలసిన సన్నివేశం. ఔచిత్యం లేని పదం ఎక్కడైనా దొర్లితే, అది ఆ విషాద సన్నివేశాన్ని చౌకబారు ఏడుపుతో ఫార్సుక్రింద దిగజార్చివేసే ప్రమాదం వున్నది. కాని భారతి ఉజ్జ్వలమైన విజయం సాధించాడు.

తమిళ కవులు అంతవరకు చాల పవిత్రంగా ఎంచుకున్న సూత్రాలన్నింటికీ విరుద్ధంగా, ఈ ఇతిహాసం ('నొండిచ్చిందు') ఛందస్సుతో ప్రారంభమౌతుంది దీన్ని ఊరూరా తిరిగే జానపద గీతకారులు ఉపయోగిస్తూ వుంటారు. సరస్వతీ బ్రహ్మలను గూర్చిన ప్రార్థనలు రాగయుక్తంగా పాడటానికి వీలుగా వున్నాయి పైకి చూస్తే చాల సులువైన మాటలుగా కనిపించే వాటి వెనుక ఎన్నో అర్థ వలయాలు దాగివున్నాయి. అవి ఇంకా తరచి అధ్యయనం చెయ్యడానికీ, ఆత్మ పరిశీలనకూ మనల్ని ప్రేరేపిస్తాయి సరస్వతిని గూర్చిన ఈ క్రింది పద్యాన్ని చూడండి. ఇందులో ప్రతీకా భావమూ కలిసిపోయి సమగ్ర స్వరూపంగా ఐక్యమై వున్నాయి :

"వేదాలు ఆమె కన్నులు, సుందర తరాలు
వ్యాఖ్యానాల కాటుకతో,
జ్ఞానజ్యోతి ఆమె నెన్నుదురు,
భావ సముదాయం ఆమె జారిన వేణి,
నిశిత తర్కమూ, సంవాదమూ
ఆమె కర్ణ భూషణాలు,
వివేక సారం ఆమె గంధం,
శాస్త్రం ఆమె వదనం."

రాజులమధ్య జరిగే సంభాషణలు ఎంతో సహజంగా నడుస్తాయి, మధ్యలో 'అడ' (అరే), వంటి సాధారణ ఆశ్చర్యార్థకాలు జొప్పించబడటంవల్ల, ఒక రచనా విభాగం యావత్తూ కేవలం ఒక సున్నితమైన వ్యక్తిగతాంశ సంస్పర్శతో ఎంతో మార్పు చెందుతుంది. ధ్వన్యనుకరణ అక్కడక్కడ చక్కని ఔచిత్య శ్రుతిని కల్పిస్తుంది. కౌరవ సభలోని నీచుల మంద మన కళ్ల ఎదుట జంతువుల్లాగా ఇటూ అటూ గెంతినట్లౌతుంది. భారతి తన కథనంలో వున్నట్లుండి "కక్ కక్-క" అనే శబ్దాన్ని వాళ్ళ నవ్వును సూచిస్తూ, తర్వాత "రక్కు-రక్" అనేదాన్ని వాళ్ళు గంతులు వేయడానికి సూచనగా, ప్రవేశపెట్టాడు. దుశ్శాసనుడు "ఓంద్ర" పెడతాడు విదురుడు "కేక" వేస్తాడు. పాంచాలి "సందేహిస్తుంది"—కావ్యంలోని భిన్న మనఃస్థితులను చిత్రించడానికి ఇలా నిత్యవ్యవహారంలోని మాటలనే భారతి ఉపయోగిస్తాడు. కవిత్వంయొక్క రస స్పర్శ మాహాత్మ్యం ఎటువంటి

దంటె, "పాంచాలీ శపథం" పాటగా వినిపించినప్పుడు దాన్ని మహత్తరమైన రుంఝా సదృశ గాంభీర్యం ఆవహించి, మరి ఏ సాంప్రదాయిక దీర్ఘ కావ్యానికీ లేని శక్తి ద్యోతకమౌతున్నది. సాంప్రదాయిక కావ్యాలలో పదాడంబరమూ అలంకార భావమూ ఎక్కువ పాంచాలిని పాచికలాటలో పందెంగా ఒడ్డిన క్షణాన్ని కవి వర్ణించడం వింటే ఎవరుమాత్రం గుండెల్లో దిగులునీ, ఆత్మలో ఆక్రోశాన్నీ, నిబ్బరించుకోగలుగుతారు ? :

"యజ్ఞ హవ్యాన్ని
నీచజాతి కుక్కకు బోనం పెట్టినట్లు,
స్వర్ణ హర్మ్యంలో
ప్రేతాన్ని నెలకొల్పినట్లు,
అమూల్య వజ్రంతో
ఘూకానికి కిరీటం పెట్టినట్లు,
ధర్మజుడు పట్టపురాణిని పణం ఒడ్డితే
ఎవరూ నోరెత్తలేదు.

ముద్దులబిడ్డని చంపి
చెప్పులకోసం చర్మం ఒలిపిస్తారా ?
రాజులు పాచిక లాడితే
పాంచాలి పణం కావాలా ?
పందెం చరిచారు,
దుష్టబుద్ధి మామ
పాచికలు వెయ్యమన్నాడు,
మాయా పాచికలు అతడు కోరినట్లే పడ్డాయి."

ఈ రీతిగానే ద్రౌపది మనస్సంక్షుభితయై చేసే ప్రార్థన ఆస్తిక భావ శిఖరాలను తాకి, క్రూరవిధి చేతజిక్కిన దీనులకు ఉపశాంతి ప్రసాదించేదిగా వున్నది.

# అధ్యాయం 14.

# మానవ భవితవ్య కవిత

వెనుక పుటల్లో వివరించిన రీతిగా, భారతి ఆదునిక తమిళ సాహిత్యానికి ఒక క్రొత్త దృష్టినీ మార్గాన్నీ ప్రసాదించాడు అంతేకాకుండా ఆయన వ్యక్తిగత జీవితం, మనుష్యులకు కారుణ్యమూ, దూరదృష్టి ఎంత అవసరమో తమిళులకు గుణపాఠం అయ్యేలా ఆయన జీవించాడు వ్యక్తిగా ఆయన నిత్యమూ రాజకీయ వేధకు గురియై ఎంతో బాధపడ్డాడు సామాజికమైన బహిష్కరణ, ఆర్థికమైన ఇబ్బందులూ ఆయన్ని చుట్టుముట్టాయి. కాని జీవితంలోని 'చేదు' ఆయన రచనల్లో ప్రతిఫలించలేదు సరికదా, ఆయన వ్రాసుకున్న దినచర్య పుస్తకంలో కూడా అది ప్రవేశించలేదు. ఎసట్లోకి బియ్యంలేవని ఆయన భార్య అంగలార్చి వుండవచ్చు, వైద్యుణ్ణి పిలిచి జబ్బుతో పడివున్న బిడ్డకు వైద్యం చేయించడానికి డబ్బులేక పోవచ్చు, తన జీవనసారమైన రచనలు వెలుగుచూచే అవకాశం మృగ్యమై తోచివుండవచ్చు, కాని భారతి ఎప్పుడుగాని నిర్వేదంలో పొర్లాడలేదు. ఆయన ఆ సమయాల్లో పరాశక్తి ధ్యానంలో శరణు పొందేవాడు. భారతిలో వ్యక్తిగతమైన బాధ ఎలాగో సామాజికమైన కారుణ్యంగానే మార్పుచెందేది ఆయనలో పరదేశ పాలకుల పట్ల పెరిగిన నిరోధం తాలూకు కోపంకూడా మెల్లగా తర్వాతి కాలంలో, పాండిచ్చేరిలో వున్న రోజుల్లోనే, పూర్తిగా తన స్వరూపాన్ని మార్చుకున్నది విప్లవ కవిగా బైలుదేరినవాడు అహింసకు దూతగా ఆయన పరివర్తన చెందాడు ఆయనకూ డా అప్పావుకూ (వి. ఒ. చిదంబరం పిళ్ళైకు చాల సన్నిహితుడీయన) జరిగిన సంభాషణగూర్చి పి. శ్రీ తెలియజేసినదానిని బట్టి మనకెంతో విషయం దీన్నిగురించి తెలుస్తున్నది భారతి ఆ డాక్టరుగారితో, బాంబుల-ఉత్సాహం రోజులు పోయాయని చెబుతూ, పొగ మధ్యలో నిప్పు రాజినట్లు శత్రువు హృదయంలో దైవాంశ నిక్షిప్తమై ఉంటుందని అన్నట్లు తెలుస్తున్నది. భారతి అటువంటి భావాన్నే "శత్రువును ప్రేమించు" అనే పద్యంలో వ్యక్తంచేశాడు. గాంధీయుగం ప్రారంభం కావడాన్ని. "మహాత్మా గాంధీ పంచకం" అనే కవితలో స్వాగతం పలికాడు :

"నిన్నేమని ప్రశంసించేది ?
నాగుబాము కాటు మాన్చిన
మూలికల ఘన వైద్యుడ వనియా?
కొండనెత్తి గొడుగు పట్టిన గిరిధారి వనియా?

నీకొక పథకం వున్నది
అది అతి నూతనం, అజేయం.
జానిసత్వపు అంధకారం నుంచీ
జ్వర పీడితుల్ని రక్షిస్తుంది.

కష్టాలకు కారకుడైన వాణ్ణి
ప్రాణాధికంగా ప్రేమించడం,
సర్వం దైవమేనని గుర్తించడం;
అందరూ ఆయన బిడ్డలే అనడం.

ఓ గురు శ్రేష్ఠా! మీరీ ధర్మ శక్తిని
సమీకరించి సాహసించి
సంఘర్షణతో మారణ కాంక్షతో
నిండిన రాజకీయ కటాహంలో
ఎదురొడ్డి నిలిచారు."

స్వస్థతను, బలాన్నీ సమకూర్చే ఈ సందేశానికి తమిళులు స్పందించారు భారతి చూపిన దారిలో నమక్కళ్ రామలింగం పిళ్ళై రచనలు చేస్తూ, గాంధీ యుగానికి కవితల్లజునిగా పేరుపొందాడు. అహింస ఉత్కృష్టతను ఉగ్గడిస్తూ ఆయన "మనదేశంలో యుద్ధం జరుగుతున్నది, అది కత్తులతో చేస్తున్న యుద్ధం కాదు, అది రక్తపాతం లేని యుద్ధం" అన్నాడు. 1920 ప్రాంతాలలో ప్రారంభమైన గాంధేయ విప్లవం, తమిళ సాహిత్యం మీద తన ప్రభావాన్ని చూపింది. భారతి వ్రాసిన పద్యం, శుద్ధానంద భారతి, ఎస్ డి సుందరంవంటి కవులకు ప్రేరణ కావడంతో వాళ్ళు సదృశ భావావేశంతో ఎన్నో పాటల్ని రచించారు.

మరొకవైపు గాంధేయ విప్లవం తాలూకు సామాజిక భావాలు, దళిత వర్గాల అభ్యుదయానికి సంబంధించి నట్టివి, పుదుమై పిత్తన్, భారతిదాసన్ వంటి కవుల రచనల్లో, తీవ్ర వాదానికి దారితీసినవి. పుదుమైపిత్తన్ అగ్ని ద్రావకంలో తన కలాన్ని ముంచి "మా కావ్యం" అనే ఒక హేళనాత్మక ఇతి హాసాన్ని వ్రాశాడు. భారతిదాసన్ భారతీయ పురాణాలనూ గాథలనూ ఊచముట్టుగా తిరస్కరించాడు అతని వల్ల ప్రేరణపొందిన యువకవులూ అదే చేశారు. దీనికి కారణం బహుశా వాళ్ళ తొందరపాటు కావచ్చు సజీవమైన మన వారసత్వంలో నుంచీ ఆదర్శ విరహితమైన లోకంలో జీవించే ఈ నాటి మనిషికి, ఆధ్యాత్మిక శక్తిని ప్రసాదించే అవకాశం వున్నదని వాళ్ళ అవగాహనకు అందక పోయింది. ఐనప్పటికీ, భారతి ప్రదర్శించిన సామాజిక స్పృహా, సూటిగా పలికే తీరూ, వాళ్ళు అలవర్చుకొని, తన్మూలంగా స్వాతంత్ర్యానంతర కాలంలో సామాన్య మానవుని హృదయాన్ని చూరగొన గలిగారు. పురాణేతిహాసాల్ని నిరసిస్తూ భారతిదాసన్ వ్రాసిన ఆవేశ పూరిత కవిత, తర్వాతి తరం రాజకీయ ఉపన్యాసకులకు ప్రేరణ కల్పించి, అను ప్రాసలతో కూడిన శబ్దాడంబర వచనశైలీ ప్రత్యేకతకు మార్గ దర్శకమైంది.

కాని ఇదంతా కేవలం తాత్కాలికమైన మార్పు లక్షణంగానే కన్పిస్తుంది భారతి వ్రాసిన నిరాడంబరమూ, తేట తెల్లమూ, సంభాషణా సహజమూ అయిన పలుకుబడుల తోడి శైలి ఎప్పటికి నిలుస్తుందని తోస్తుంది ఇప్పుడు వ్రాస్తున్న రచయితలు సమకాలీన తమిళంనుంచీ పడికట్టు పదబంధాలను తొలగించివేయాలనే ప్రయత్నంలోనే వున్నారు కన్నదాసన్, కంబదాసన్ వ్రాసిన గీతాలూ, క.శ్రీ శ్రీ, రా వీఝినాథన్ గారల వచన తర్జుమాలూ, జయకాంతన్ వ్రాసే విమర్శలు (ఈయన భారతి "పాప్పపాట్టు" గీతాల్లో విద్యాబోధనకు ఉపయుక్తమైన అంశాలను గూర్చి వ్రాశారు), కె వి జగన్నాథన్ సమీక్షలు, యం వరదరాజన్, టి జానకిరామన్ గార్ల నవలలూ, ఇవి అన్నీ అందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. భారతి స్వీయరచనలు ఆయన జీవితకాలంలో పొందినట్లుగానే ఇప్పటికీ ప్రజాదరణ పొందుతున్నవి. ఆయన శతజయంతి సంవత్సరం దగ్గర పడుతున్న ఈ నాటికీ ఆ ప్రజాదరణలో తగ్గుదల కనిపించడం లేదు నిజానికి ఇప్పుడు ఆయన కవితలకు ఇంగ్లీషు తర్జుమాలు ఎందరో రచయితల హస్తాలనుంచీ వెలువడుతూ వుంటే, క్రమంగా భారతిని సమైక్య వాదిగా గుర్తిస్తున్నారు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు చాల ఏళ్ళ క్రితమే నవరత్న రామారావు ఇలా అన్నారు:

"ఆయన మాతృభాష తమిళమే కావచ్చు, కాని ఆయన మాతృభూమి భారతదేశం ఆయన అచ్చంగా భారత జాతీయ కవి. ఆయన హృదయం ఒక కోవెల, అది ఆమె పట్ల శ్రద్ధాభక్తులకే అంకితమైనది; ఆమె కష్ట నష్టాలకు ఆవేదన పడి, ఆమె భవితవ్యం పట్ల ప్రజ్వలిత విశ్వాసంతో శక్తి నింపుకున్నది ఆ హృదయం."

నవరత్న రామారావు భారతి రచనల్ని మూలంలో చదివేందుకు తనకు తమిళం తెలియక పోయిందని విచారం వ్యక్తం చేశారు ఆయనకే తమిళం వచ్చి వుంటే, మందాయం శ్రీనివాసాచారియర్ పలికిన ఈ క్రింది వాక్యాలను సమర్థించి వుండేవారు :

"ఆయన ఉత్తమ కవి మాత్రమే కాదు, మానవ ప్రకృతి యొక్క సాధ్యాసాధ్యాలను ఎరిగిన గొప్ప ద్రష్టకూడా, ఆ విధంగా ఆయన తమిళ దేశానికి, లేక భారతదేశానికి, మాత్రమే చెందిన కవి అనడానికి వీల్లేదు ఆయన మానవజాతి ప్రగతి లక్ష్యాన్ని దర్శించి, మానవ కల్యాణాన్ని గూర్చి గానం చేసిన గాయకుడు. భారతదేశ ప్రకృత స్థితి గతుల్ని వర్ణిస్తూ మొదలుపెట్టి దేశాన్ని నిస్పృహాయత నుంచీ, అర్థంలేని ఆచారాలనుంచీ, విముక్తి చెందేలా అడుగుముందుకు వెయ్యమని ఉద్బోధించాడు

" "పాప్పపాట్టు" నుంచీ ప్రారంభించి భారతదేశానికి తన ప్రాచీన వీరుల ఉదంతాలని జ్ఞాపకంచేస్తూ ఆయన "శక్తిపాట్టు" రచనల్లో దేశం ఎలా భావి యుగాల్లో అమరత్వాన్ని పొందగలదో దర్శింపజేస్తాడు. అప్పుడీ భౌగోళిక సరి హద్దులు చెరగిపోయి, దేశాభిమానం ముసుగులో దాగిన కావేషాలన్నీ కరిగి పోతాయి."

భారతి ఇలా గానం చేశాడు :

"అన్నీ నీవై అవతరించావు
ఓ కాళీ! సర్వత్రా నీవే,
పాప పుణ్యాలూ—
అవి దైవ లీలలే కావా?
చాలునిక జీవితమనే
ఈ పచ్చి అబద్ధం.

ఆది శక్తీ! అమ్మా!
మాం పాహి!''

"మహాశక్తి స్తుతి" అనే కవితలో భారతి పొందిన ఆనందాశ్చర్యాల రసావేశం యొక్క ఉత్తమాభి వ్యక్తిని చూడగలము :

''విహాయసమై విస్తరించావు
ఊహాతీతంగా.
విశ్వగోళాలను వినిర్మించి
వేగంతో త్రిప్పావు గిర్రున,
గగనాంతరాళంలో వుంచావు
వాటిని దూరంలో మాకు,
అనంత యోజనాల కావల.
ఓ సాక్షాద్రూపమా! ప్రస్తుతింతు నిన్ను, కాళీమాతా''

చిట్ట చివరగా, ద్రష్టయైన భారతి ఈ భువిపై దివ్య జీవనాన్ని ప్రవచిస్తూ "మ్రోగించు గంట" అనే గీతంలో ఇలా అన్నాడు :

''భువిపై సమానత్వం,
సోదరత్వం,
స్వేచ్ఛ—ఇవే
దివ్య వరాలు!

భువిపై జీవించే
మానవులందరికీ ఆహారం
ఓ అభ్యుత్థాన ప్రపంచమా
విద్యా పక్షాలనీ విహారం

ఓ భేరీ! మ్రోయించు సమైక్యాన్ని,
ప్రేమ విజయాన్ని,
సర్వేజనాః
సుఖినో భవంతు!''

## అనుబంధం 1.

# కొన్ని కవితలు

## 1

### నివేదితకు

నివేదితా, అమ్మా,
ప్రేమాలయా,
నా ఎదలో చీకటి విరిసే ఉషోదయా.
మా జీవన కేదారాలకు వర్షోదయా,

దీనార్తులకు సదయ హృదయా,
కారుణ్య నివేదితా,
సత్యాంశ దివ్యాంశు సంభరితా,
నమోస్తు! నమోస్తు!

## 2

### స్వాతంత్ర్య స్తుతి

అమ్మా! నీ కరుణా కటాక్షమున కగ్రుణాచి
జీవిత సర్వస్వాన్నీ నీకై నివేదించిన వారు
కటిక చీకటి కటకటాల వెనుక క్రమగ్గినా
నందన వనానికే పయనిస్తారు!

నీ కృపా వీక్షణానికి నోచుకోని దౌర్భాగ్యులు, తల్లీ,
దాస్య వృత్తిని ఔదల దాల్చి
నవరత్న ఖచిత సౌధాలలో విహరించినా
కఠిన కారాగార వాసమే అనుభవిస్తారు.

వీరోచిత కృత్యాలతో నీదయ సాధించి
పశ్చిమ దేశీయులు నవజీవన సారథులైరి,
వారికి సర్వమూ సాధ్యమే, వారు సర్వవేళలా సిద్ధమే
ఆత్మ త్యాగమే వారి పరమార్థం.

హతవిధీ, ఈ భూమిపై జన్మించి
గత వైభవాన్ని విస్మరించిన యీ అభాగ్యుడు
వీడు నీ కృపా వీక్షణ మహత్త్వ మెరింగి
నిన్ను సదా అర్చించు విధమెట్లు తల్లీ?

జ్యోతిర్మయీ! సాహసామృతా!
ధర్మ సంరక్షణీ!
దుఃఖ దురిత వినాశినీ!
దయజూడు మమ్మతల్లీ:

## 3

### స్వా తం త్ర్య గీ తి

ఆటకు పాటకు యిది సమయం
ఆనందంతో స్వేచ్ఛతో నిండెను హృదయం.

కుల గర్వం నశించిందీ
పరాయి పాలన పోయిందీ
బానిస బ్రదుకు ముగిసిందీ
దగాకోరు రాజ్యం కూలిందీ.

స్వేచ్ఛ అందరి మాట
సమానత్వం అందరి అనుభవం
విజయ శంఖం పూరిస్తాం
సత్యాన్నే ఘోషిస్తాం.

మనిషి సమానత్వంలో పుట్టేలా
మనిషిలో కుళ్లూ, మోసం గిట్టేలా
మంచివాళ్లే మించే వాళ్లయి,
దుష్టులు నష్టమయ్యేలా చూస్తాం.

కర్షకునికి కార్మికునికి జోహార్!
తిండిపోతుకూ, తిరుగుబోతుకూ శాస్తి!
ఇహ మరు భూములకు నీళ్లు మళ్లించం.
ఇహ సోమరి పోతులకు స్వేదం ధారపొయ్యం.

ఇది మాభూమి, మాభూమి,
ఎప్పటికీ మాదే;
పరాధీనత యికపై చెల్లు
దైవాన్ని సేవిస్తాం, ప్రగతిని సాధిస్తాం.

# 4

## లో క వి ల య ం

లోకాలు ఢీకొని
ప్రళయమ్ము గర్జించి
రక్తాన్ని వర్షించి రాక్షసి మూక
విలయ గీతం ఆలపిస్తే
ఓ తల్లీ! ఆరంభించు నీ నృత్యం
రాగ తాళ యుక్తం
మహాకాళీ! చాముండీ! గంగాలీ!
అమ్మా! అమ్మా!
నీ ఆట చూడటానికి
నన్ను పిలిచేవా తల్లీ!

పంచ మహాభూతాలు
కలగి చెలగి ఒకటై

అంతా అదృశ్యమై
'శక్తి'లో అంతర్భూతమై
మనో ప్రపంచమే మాడి మసియై
అంతా శూన్యమై—
నీ విలయ తాండవం
ప్రచండాగ్ని వలయం!
అమ్మా! అమ్మా!
నీ ఆట చూడటానికి
నన్ను పిలిచేవా తల్లీ!

భగ్నరాసులూ
భయదభీకరాత్రై
ప్రమథ గణాలూ
ప్రక్కకు తొలగి
మరణ దేవతా
హాహాకారం చేస్తే
నువ్వు గర్జిస్తావు
నువ్వు నర్తిస్తావు!
అమ్మా! అమ్మా!
నీ ఆట చూడటానికి
నన్ను పిలిచేవా తల్లీ!

ప్రమథులు చెలగి
తలలు ఢీ కొడ్తూ
తాళగతులు పాటిస్తే
నీ కన్నుల విస్ఫులింగాలు
నేల చెరగుల్ని తాకితే
అదే అంతిమ క్షణం
అదే విశ్వప్రళయం!
అమ్మా! అమ్మా!

నీ ఆట చూడటానికి
నన్ను పిలిచేవా తల్లీ!

కాలం తోపాటు ముజ్జగాలూ
కూలిన కుప్పయై
మహోద్వేగం మందగించి
ఏకాంతం మేలుకొంటే
మంగళకర శివమూర్తి
తీరుస్తాడు నీ ఆర్తి
ఆ క్షణం నువ్వు హసిస్తావు
ఆయనతో కలిసి చేస్తావు
ఆనంద లాస్యం!
అమ్మా! అమ్మా!
నీ అట చూడటానికి
నన్ను పిలిచేవా తల్లీ!

## 5

### కృష్ణా. రావయ్యా!

కృష్ణా, రావయ్యా!
రావయ్యా, కృష్ణా!
లక్ష్మీ మనోహరా
జ్ఞానదీపమై రావయ్యా;
మూలకారణా,
జీవనామృతమియ రావయ్యా, కృష్ణా!

రావయ్యా, నా ఎదలోకి
నాలోజేర రావయ్యా,
లేలేవయ్యా నీ శస్త్రాస్త్రాలతో
అసుర గణాలను అణచి వేయగా రావయ్యా, కృష్ణా!

నీలి కడలిపై ఉదయించే
సూర్య తేజస్స్వరూపా,
కృష్ణా, దేవగణ ప్రియా,
ప్రియ సఖా, అంజలింతు రావయ్యా, కృష్ణా!

## 6

## పాంచాలి శపథం

రాజ్యాన్ని పందెం ఒడ్డగా విదురుని హెచ్చరిక :

[హస్తినాపురి. కౌరవ సభలో శకుని యుధిష్ఠిరులు పాచిక లాడుతున్నారు. యుధిష్ఠిరుడు క్రమంగా అన్నీ ఓడిపోయి, యిప్పుడు రాజ్యాన్నే పందెం ఒడ్డినాడు. పినతండ్రి విదురుడు మన స్తాపంతో అగ్రజుడైన ధృతరాష్ట్రుని ఉద్దేశించి పాచికలాట నిలి పేందుకు ఆజ్ఞ యిమ్మనీ, వంశాన్ని సమయం మించిపోక ముందే క్షయం నుంచీ కాపాడమనీ అర్థిస్తాడు.]

"దీన్నేమంటారు ?
ఇలాంటివి రాజులు చేయదగ్గవా?
రాజ్యాన్ని జయించడమంటే
జూదమాడి గెలవడమా ?
దీన్ని లోకం హర్షిస్తుందా ?
దేవతలు క్షమిస్తారా ?
ఇది దుస్పృహం; దిగంత విశ్రాంత కీర్తితో
విరాజిల్లిన వంశంలో మనం జన్మించలేదా ?"

అన్నాడు విదురుడు.

"ఒకవేళ పాండవులు మిన్నకుండినా
కృష్ణుడూ, ద్రుపదుడూ మండి పడరా,
మన వంశాన్ని మూలచ్ఛేదం చేయరా ?
కురువంశ రాజులందరినీ

ఉద్దేశించి పలుకుతున్నాను, జాగ్రత్త!
ఆత్మవినాశనాన్ని తెచ్చుకోకండి,
కోరి నరకంలో పడకండి.

"వంశ క్షయానికి కాకపోతే
దుర్విధి మన మధ్య
కుటిల దుర్యోధనుణ్ణి పుట్టించడ మెందుకు?
అతడు పుట్టిన వేళ
వేయి సృగాలాలు రోదించాయి
కార్తాంతికులన్నారు
ఈ శిశువు జననం
వంశంలో కష్టలకు కారణమౌతుందని.

'సామర్థ్యంలేని ఓ అంధరాజా!
పుత్రుడు ద్యూతంలో రాజ్యాన్ని గెలిచాడని
స్వర్గాధిపతిలా కూర్చున్నావు.
తేనెపట్టు కోసం వెంపరలాడుతూ
ముందు వెనుకలు కానని బోయవాడు
దారి మధ్యగల అఖాతాన్ని చూడలేడు.

"మీరందరూ ఊహించలేకున్నారు
మత్తెక్కించిన ఈ ఆట ఎక్కడికి దారితీస్తుందో.
ఒక్క దుర్యోధనుని కోసం
వంశం సర్వం ఆత్మహత్య చేసుకోవాలా?
నిన్ను ప్రేమించే పాండవుల్ని
నామరూపాలు లేకుండా చెయ్యాలని సిద్ధపడుతున్నావే,
అనుభవం నీకేమీ నేర్పినట్లు, సోదరా?
ఉప్పు నీట గలిసిన రుచిలా అది వమ్మైపోయిందే!

"పుత్ర మమకారంతో పెంచినవాడు
సృగాలమై, విష సర్పమై తోచాడే
ఈ సృగాలాల్ని కాదని బెబ్బులుల్ని

ఈ ఘూాకాల బదులు నెమిళ్ళని
ఎంచుకుని అనశ్వర కీర్తి ఆర్జించ రాదా!
తెరచిన కళ్లతో వినాశాన్ని తెచ్చుకుంటావా?
చెవులు కూడా వినబడటం లేదా?

"నీకు వయస్సు మళ్లిన స్థితిలో
సోదర పుత్రుల ఆస్తికోసం దురాశ పుట్టిందా?
వాళ్లు నీ శరణు కోరలేదా?
వాళ్లు నిన్ను ప్రభువుగా మన్నించలేదా?
పోనీ, వాళ్ళ ఆస్తిపాస్తులు నీవు కావాలనుకుంటే
వాళ్ళే నీకు సమర్పిస్తారు కదా,
ఎందుకయ్యా, నీకీ కుయుక్తి?
నరకానికి దోవచూపే ప్రవృత్తి?

"వాసి కెక్కిన కురు రాజేంద్రుని పేరోలగంలో
ద్రోణ కృపాచార్యులూ, భీష్మడై
కీర్తి గడించిన గాంగేయుడూ, నేనూ
పనికిరాని వాళ్లమై
దుర్మతి శకుని మాటే వేదవాక్కై కూచుందా?
ఎవరయ్యా, ఈశకుని?
కొండల్లోని అతని దేశానికి అతణ్ణి సాగనంపు!

"ధర్మాన్ని పణమొడ్డి
సుఖించాలని చూస్తున్నావా?
శకుని మంతనాల ఫలితంగా
మిత్రుల్ని శత్రుల్ని చేసుకుని
లోక నిందను ఆహ్వానిస్తావా?
లోకం నిన్ను శాపనార్థాలు పెడితే
ఆ బ్రదుకు నువ్వు భరించగలవా?
ఈ ఆట కట్టించు, నీకు శుభం కలుగుతుంది"

అని ముగించాడు.

# 7

## కోయిల పాటలు

ప్రేమ, ప్రేమించు నిరంతరం
ప్రేమ విఫలమైతే
చావు, చావే అనంతరం.

వెలుగు, వెలుగు నిరంతరం
వెలుగు కొండెక్కితే
చీకటే అనంతరం.

ఆనందం, అంతులేని ఆనందం
ఆనందం అంతమైతే
దుఃఖం, అవును దుఃఖమే.

సంగీతం, ఎంత తియ్యని సంగీతం
సంగీతం చతికిలబడితే
అన్నీ అపశ్రుతులే.

తాళం వెయ్యి, తాళం వెయ్యి
తాళం తప్పితే
గందరగోళమే.

కవితా గళం దివ్యం
కవిత కడగట్టితే
మిగిలేది మట్టీ మాలిన్యమే.

కీర్తి రావడం మంచిదే
కాని అడుగు జారిందా
అధఃపతనమే.

గట్టిగా కాలూని నిలబడు
జంకు చూపావా
మసై పోతావ్

జంట కూడితే ఎంత ఆనందం
అది విడిపోయిందా
విరహ విషాదమే.

ఎన్ని తియ్యందనాల దీ పిల్లనగ్రోవి,
ఇది చిలిందా,
సరే, గిరవాటు వేయి.

## 8

## వ చ న క వి త: శ క్తి

### పా ము ల వా డు

పాములవాడు బూరా ఊదుతాడు
సంగీతం వెదురు క్రోవిలో పుట్టిందా ?
రంధ్రంలో పుట్టిందా ?
పాములవాడి ఊపిరిలో పుట్టిందా ?
అది అతని గుండెలో పుట్టింది,
అది బూరాలోంచి వెలికి జారింది.
గుండె వేరుగా పలకదు.
క్రోవితానై ఊదదు.
గుండె క్రోవితో కలియదు
కాని గుండె ఊపిరితో మేళవించి,
ఊపిరి క్రోవితో కలుస్తుంది.
అప్పుడే క్రోవి స్వరాల్ని పలుకుతుంది.
ఇదే శక్తి విన్యాసం.
ఆమె గుండెలో పాడుతుంది.
ఆ పాట వెదురు రంధ్రాల్లోంచీ వినిపిస్తుంది,

శక్తి రెండు విజాతీయ వస్తువుల్ని కలిపి సంగీతం సృష్టిస్తున్నది.
ఎరుకల కుర్రాళ్లు బిచ్చమడుగుతున్నారు
పాములవాని బూరా స్వరానికీ
ఎరుకల కేకకూ శ్రుతి కల్పిందెవ్వరు?
శక్తి.
'పట్టు చీరలు!' అంటూ కేక వేస్తాడొకడు, అదే శ్రుతిలో.
అవును, నాకు అర్థమైంది—
పాములవాడి బ్రదుకులో, ఎరుకల బ్రదుకులో,
పట్టు చీరలమ్మేవాని బ్రదుకులో
ఆ శక్తే తాండవిస్తున్నది
జంత్రాలెన్నో, పాటగాడు ఒక్కడే
రూపాలెన్నో, సత్త్వం ఒక్కటే.
జై, మహాశక్తి!

## అనుబంధం 2

# భారతి జీవితంలో ప్రధాన ఘట్టాలు:

డిసెంబర్ 11, 1882 సుబ్రహ్మణ్య భారతి జననం.

1887: తల్లి లక్ష్మి అమ్మాళ్ మరణం.

1888-93: ప్రాథమిక విద్య, ఆంగ్లో-వెర్నాక్యులర్ పాఠశాల, ఎట్టాయపురం

1894-97: హైస్కూలు విద్య, హిందూ కాలేజి, తిరునల్వేలి.

జూన్ 1897: చెల్లమ్మాళ్‌తో వివాహం.

జూన్ 1898: తండ్రి చిన్నస్వామి అయ్యర్ మరణం.

1898-1901: బెనారస్‌లో నివాసం. అలహాబాద్ విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్షలో ప్రథమ శ్రేణి ఉత్తీర్ణత.

1902-4: ఎట్టాయపురం రాజా దగ్గర సహచరుడుగా ఉద్యోగం.

జూలై 1904: 'ఏకాంతం' తమిళ పద్యం 'వివేక భాను'లో ప్రచురణ: ముద్రణ పొందిన ప్రప్రథమ రచన.

ఆగస్ట్-నవంబర్ 1904: తాత్కాలిక తమిళ పండితుడుగా ఉద్యోగం, సేతుపతి హైస్కూలు, మధురై.

నవంబర్ 1904: ఉప సంపాదకుడు: 'స్వదేశ మిత్రన్', సంపాదకుడు: 'చక్రవర్తిని' మాస పత్రిక.

1905: సోదరి నివేదితను దర్శించడం.

ఏప్రిల్ 1906: 'ఇండియా' విప్లవ వార పత్రికకు సంపాదకత్వ బాధ్యత వహించడం.

డిసెంబర్ 1907: సూరత్ కాంగ్రెస్‌కి వెళ్ళడం; కాంగ్రెస్‌లో చీలిక.

1908: 'స్వదేశ గీతంగళ్' ప్రచురణ: భారతి పాండిచ్చేరి చేరడం.

1909: 'జన్మభూమి'

1910: 'ఇండియా' పత్రిక ఆగిపోవడం.

1910: 'మాతమణి వాచకమ్'

1912: 'పాంచాలి శపథమ్'-భాగం 1.

1914: 'బంగారు తోకగల నక్క'

1917: 'కణ్ణన్ పాట్టు'

నవంబర్ 1918: భారతి మాతృదేశానికి తిరిగి రావడం; అరెస్ట్ చెయ్యబడి ఒకనెలలో విముక్తుడు కావడం.

1918-1920: కడయమ్‌లో నివాసం

మార్చి 1919: మహాత్మాగాంధిని రాజాజీ యింటిలో దర్శించడం.

డిసెంబర్ 1920: మళ్లీ 'స్వదేశమిత్రన్' ఉప సంపాదకత్వం.

జూలై 1921: తిరువల్లిక్కేణి దేవాలయంలో ఏనుగువల్ల ప్రమాదం.

సెప్టెంబర్ 12, 1921: తెల్లవారుజామున సుబ్రహ్మణ్య భారతి మృతి.

అనుబంధం 3

# సుసంచిత గ్రంథ సూచిక

## 1 సుబ్రహ్మణ్య భారతి రచనలు :


మహాకవి భారతియార్ కవితైగళ్ (శక్తికార్యాలయం, మద్రాసు-6, 1957)

భారతి రచనలు : వ్యాసములు (భారతి ప్రచురణాలయం, మద్రాసు, 1940)

భారతి పుతయాల్ (సం॥ ఆర్ ఎ. పద్మనాభన్, అముద నిలయం, మద్రాసు, 1958)

కట్టురైగళ్ (ఇంబ నిలయం, మద్రాసు, 1963)

భారతి తమిళ్ (సం॥ పి. తూరన్, ఇంబ నిలయం, మద్రాసు, 1963)

అగ్ని, యితర కవితలు, అనువాదాలు (సం॥ సి. ఆర్. రెడ్డి. కె. ఎస్. వేంకట రమణి, భారతి ప్రచురణాలయం మద్రాసు, 1937)

వ్యాసములు, యితర వచన ఖండములు (సం॥సి. ఆర్. రెడ్డి, కె. ఎస్. వేంకట రమణ, భారతి ప్రచురణాలయం, మద్రాసు, 1937)


## 2. ఇతరుల రచనలు :


అనంతాచారి, ఆకూర్ : కవి చక్రవర్తి సుబ్రహ్మణ్య భారతి చరిత్రం (కిట్ట ప్పమలర్ ప్రచురాలయం, షెంకోట్టై, 1936)

భారతి తంగమ్మాళ్ : భారతియారుమ్ కవితయుమ్ (పుదుమై పదిప్పగమ్, కరైకుడి, 1947)

భారతి, ఎస్. విజయ : సి. సుబ్రహ్మణ్య భారతి (పబ్లికేషన్స్ డివిజన్, న్యూఢిల్లీ, 1972)

సుబ్రహ్మణ్య భారతి : వ్యక్తిత్వమూ కవిత్వమూ (మున్షీరామ్ మనోహర్ లాల్, న్యూఢిల్లీ, 1975)

హార్ట్ 3, జార్జి ఎల్ : ప్రాచీన తమిళ కవితలు (యూనివర్శిటీ ఆఫ్ కేలి ఫోర్నియా ప్రెస్, బెర్క్లీ, 1975)

అయ్యంగార్, కె. ఆర్. శ్రీనివాస : ఇంగ్లీషులో భారతీయ రచనలు రెండవ కూర్పు (ఏషియా పబ్లిషింగ్ హౌస్, బాంబే, 1973)

అయ్యంగార్, కె. అర్. శ్రీనివాస (సం): స్వాతంత్ర్యానంతర భారతీయ సాహిత్యము (సాహిత్య అకాడెమీ, న్యూ ఢిల్లీ, 1973)
జయకాంతన్ : భారతి పాదం (కలైగ్న్యాన్, పతిప్పాహం, మద్రాసు-17, 1974)
మహాదేవన్, పి: సుబ్రహ్మణ్య భారతి - స్మృత్యంజలి (అత్రి పబ్లిషర్స్, మద్రాసు, 1957)
నందకుమార్, ప్రేమా: సుబ్రహ్మణ్య భారతి (రావ్ అండ్ రాఘవన్, మైసూరు, 1964)
సుబ్రహ్మణ్య భారతి (నేషనల్ బుక్ ట్రస్ట్, న్యూఢిల్లీ, 1968)
సుబ్రహ్మణ్య భారతి కవితలు (సాహిత్య అకాడెమీ, న్యూ ఢిల్లీ, 1977)
పద్మనాభన్, అర్. ఏ.: చిత్ర భారతి (అముద నిలయం, మద్రాసు, 1957)
పిళ్లై, ఎ. దొరస్వామి (అనువాదం): భారతి కవితలు: కణ్ణన్‌పాట్టు, కుయిల్ పాట్టు (న్యూసెంచరీ బుక్ హౌస్, మద్రాసు, 1966)
రాజగోపాలన్, కె. పి. అండ్ సుందరరాజన్, పి. కె. కణ్ణన్ ఎన్ కవి (శక్తి కార్యాలయం, మద్రాస్, 1957)
రామస్వామి, వి: మహాకవి భారతియార్ (శక్తి కార్యాలయం, మద్రాసు, 1944)
శాస్త్రి, కె. ఎస్. రామస్వామి: సుబ్రహ్మణ్య భారతి-ఆయన మనస్సు, కళా (వెల్త్ అండ్ వెల్‌ఫేర్ ఆఫీస్, మద్రాసు, 1951)
శ్రీనివాస రాఘవన్, ఎ (సం): కవిగళము: భారతి పద్యానువాదాలు ఇంగ్లీషులో (భారతి తమిళ సంఘం, కలకత్తా, 1951)
సుబ్రహ్మణ్యం, కె. ఎన్. (సం): భారతి (తమిళ రచయితల సంఘం, మద్రాసు, 1959)
సుందరం, పి. ఎమ్: భారతియార్ : వరలారుమ్ కవితయుమ్ (ఓరియంట్ లాంగ్మన్స్, మద్రాస్, 1954)
విశ్వనాథన్, సి. భారతి, ఆయన రచనలు (భారతి ప్రచురాలయం, మద్రాసు, 1929)
యాదుగిరి అమ్మాళ్ : భారతి నినైవుగళ్ (ఆనంద నిలయం-మద్రాసు-1954)

